*Photo by:* A. V. RAMAMOORTHY



A SHRINE

అత్యంత
అధునాతనమైన




వస్త్రాలకై
సందర్శించండి

PHONE : 76545

ప్రత్యేక షో రూం

# జూలూరి వీరేశలింగం

ఎంటర్ ప్రైజెస్
జనరల్ బజార్ సికింద్రాబాద్

# చందమామ

సంస్థాపకుడు : నాగిరెడ్డి
సంచాలకుడు : 'చక్రపాణి'

ఈ నెల బేతాళకథ [''తండ్రికి తగిన కొడుకు''] బూర్లె నాగేశ్వరరావు రచన. ఏప్రిల్ '74 సంచికలోని బేతాళకథ [''మారినమనసు'']కు ఇది తరువాయి.

ఈ సంచికనుంచి కొత్తరంగుల బొమ్మల సీరియల్ "వీరహనుమాన్" ప్రారంభమవుతున్నది. వేరు వేరు పురాణాలలో గల హనుమంతుడి కథలను ఒక కథగా కూర్చి చందమామ పాఠకులకు అందిస్తున్నాము. ఇది పాఠకులనుఆకర్షిస్తుందనుకుంటాము.

సంపుటి 55 అక్టోబర్ '74 సంచిక 4





# మిత్రభేదం

## 16

సంజీవకం దమనకానికి హంస కథ చెప్పి, "నమ్మిన మూఢుడు వెనకటికి ఒంటె లాగా జిత్తులమారి అయిన దుర్మార్గుడి మూలాన మోసపోతాడు," అన్నది.

"ఏమిటా కథ?" అని దమనకం అడిగింది.

సంజీవకం ఇలా చెప్పింది:

### మోసపోయిన ఒంటె కథ

సాగరదత్తుడు అనే గొప్ప వర్తకుడు ఉండేవాడు. అతను ఒకసారి నూరు ఒంటెల మీద మేలురకం వస్త్రాల మూటలు ఎక్కించి, వర్తకం నిమిత్తం తన ఊరి నుంచి బయలుదేరాడు.

ఆ ఒంటెలలో వికటం అనే ఒంటె మీద బరువు ఎక్కువగా పడింది. ఆ బరువు మొయ్యలేక ఆ ఒంటె, కాళ్ళు నీరసమై పోయి, కూలబడి పోయింది. అది కదలలేని స్థితిలో ఉండటం చూసి, వర్తకుడు దాని మీది మూటలను ఇతర ఒంటెల మీద సర్ది, అది భయంకరమైన అరణ్యప్రాంతం కావటం చేత, అక్కడ మజిలీ చెయ్యటం ఇష్టం లేక, ఒంటెను దాని కర్మానికి వదిలి, వెళ్ళిపోయాడు.

వర్తకుడు వెళ్ళిపోయిన చాలా కాలానికి, వికటం అనే ఆ ఒంటె, అటూ ఇటూ కదిలేస్థితికి వచ్చి, అడవి పచ్చిక మేస్తూ, గుంటలలో నీరు తాగుతూ క్రమంగా పుంజుకున్నది.

అదే అరణ్యంలో మదోత్కటం అనే సింహం ఉండేది. దానికి ఒక చిరుత పులీ, ఒక కాకీ, ఒక నక్కా సేవకులుగా ఉండేవి. ఆ సింహం తన భృత్యులను వెంటబెట్టుకుని అరణ్యంలో సంచారం

అట్ట చివరి బొమ్మ

చేస్తూ ఒంటెను చూసి, "ఈ వికారాకారం గల వింత జంతువు ఏమిటి? ఇది అరణ్యంలో ఉండే జంతువో, గ్రామాలలో ఉండేదో తెలుసుకు రండి," అని తన సేవకులతో అన్నది.

ఒంటెలను గురించి అదివరకే ఎరిగిన కాకి సింహంతో, "ఇది పెంపుడుజంతువు. దీన్ని ఒంటె అంటారు. దీని మాంసం చాలా రుచిగా ఉంటుంది," అన్నది.

దానికి సింహం, "నాలో విశ్వాసం ఉంచి నా ఇంటికి వచ్చిన ప్రాణిని ఎన్నడూ చంపను. 'ఇంటికి వచ్చిన అతిథిని చంపితే బ్రహ్మహత్యతో సమానమైన పాపం చుట్టుకుంటుందంటారు. అందుచేత, ఆ ఒంటెకు అభయం ఇచ్చి, దాన్ని నా వద్దకు తీసుకురండి. అది వచ్చిన పని ఏమిటో తెలుసుకుంటాను," అన్నది.

సింహం సేవకులు వెళ్ళి, ఒంటెకు అభయం ఇచ్చి, దాన్ని తీసుకు వచ్చాయి. ఒంటె తన ముందు సాష్టాంగపడినాక, సింహం దాన్ని, "నువు అరణ్యానికి ఎలా వచ్చావు?" అని అడిగింది.

ఒంటె సింహానికి తన కథ అంతా చెప్పింది. అప్పుడు సింహం, "నువు మీ ఊరికి తిరిగి వెళ్ళకు. బరువులు మోయకు. నాతోపాటు అరణ్యంలోనే ఉండి, పచ్చని గడ్డి తిను," అన్నది.



ఒంటె ఆ ప్రకారమే అరణ్యంలో నిశ్చింతగా ఉండిపోయి, సింహానికి నాలుగో భృత్యుడు అయింది.

కొంతకాలం గడిచింది. సింహం ఒక ఏనుగుతో తలపడి పోరాడటంలో, ఏనుగు తన దంతాలతో సింహాన్ని పొడిచి తీవ్రంగా గాయపరిచింది. అందుచేత అది తన గుహ నుంచి కదలలేని స్థితిలో ఉండిపోయింది.

అయిదు రోజులు ఇలా గడిచేసరికి, సింహమూ, దాని ముగ్గురు పరిచారకులూ తిండికి మాడి చచ్చే పరిస్థితి ఏర్పడింది. ఎందుకంటే, సింహం బయటికి వెళ్ళి ఆహారం కోసం వేటాడటం లేదు. పచ్చిక

తిని బతుకుతున్న ఒంటె మాత్రం బాగా కొవ్వి ఉన్నది.

తన అనుచరుల దీనస్థితి గమనించి సింహం, "నేను గాయపడి, జబ్బు చేసి, వేటాడలేను గనక, వెనకటి లాగా మీకు ఆహారం ఇయ్యలేను. మీరే ఎలాగైనా తంటాలు పడి, ఏ జంతువునైనా సంపాదించి తినండి," అన్నది.

"ఏలినవారు ఈ స్థితిలో ఉండగా మా శరీరపోషణ గురించి మేం ఏమి ఆలోచించగలం?" అన్నాయి మిగిలినవి.

"ఆహా, మీకు నా పట్లగల భక్తి విశ్వాసాలు మెచ్చదగినవి. మీరు వెళ్ళి ఏదైనా జంతువును నాకు కానుకగా పట్టుకురండి. అందరమూ తిందాం," అన్నది సింహం.

మిగిలిన జంతువులు దీనికి జవాబు చెప్పలేదు.

"మొహమాట పడకండి. వెళ్ళి, ఏ జంతువునైనా చూడండి. ఈ స్థితిలో కూడా నేను వచ్చి, దాన్ని చంపి, మీకు ఆహారం ఇస్తాను," అన్నది సింహం.

సింహం అనుచరులు నాలుగూ జంతువుల కోసం వెతుకుతూ బయలుదేరాయి. కాని వాటికి ఒక్క జంతువూ కనబడలేదు. నక్కా, కాకీ రహస్యాలోచనకు దిగాయి.

"కాకి మిత్రమా, మనం అర్థం లేకుండా ఎందుకు తిరగాలి? ఈ ఒంటె వికటం కొవ్వి ఉన్నది గదా! దీన్ని చంపి తింటే మనకు చాలా రోజులు సుఖంగా జరిగిపోతుంది గద!" అన్నది నక్క.

దానికి కాకి, "మిత్రమా, ఆ మాట నిజమేగాని, ఈ ఒంటెకు మన యజమాని అభయం ఇచ్చి ఉండగా మనం ఎలా చంపుతాం?" అన్నది.

"అలా అయితే, నేను యజమాని వద్దకు వెళ్ళి, ఒంటెను చంపటానికి అనుమతి సంపాదిస్తాను," అని నక్క కాకితో రహస్యంగా అని, పైకి మిగిలిన వాటితో, "మిత్రులారా, మీరు ఇక్కడే ఉండండి. నేను యజమాని వద్దకు వెళ్ళి కర్తవ్యం తెలుసుకుని వస్తాను," అన్నది.





4

[తన ముగ్గురు కుమార్తెలనూ రాబందులు తన్నుకు పోయినవని రాజు అందరికీ చెప్పి, నమ్మించాడు. ఒక రాత్రివేళ ఆయన శయనాగారం లోపలికి పెద్ద కుమార్తె సుహాసిని వచ్చింది. రాజు ఆ పిల్లను దాదికి ఒప్పచెప్పి, శయనాగారం వైపుకు వున్న సారంగ మార్గాన్ని పరీక్షించి, తిరిగి వెళ్ళేసరికి సుహాసినీ, దాదీ కూడా కనిపించలేదు. తరవాత—]

సారంగ మార్గంలో మరెక్కడైనా రహస్య ద్వారాలున్నవేమో అనుకుంటూ రాజు మరికొంత దూరం వెళ్ళేసరికి, ఒక చోట హఠాత్తుగా ద్వారం ఒకటి కనిపించింది. దాని ముందు దాదీ, సుహాసినీ కనిపించే సరికి రాజుకు ప్రాణం లేచి వచ్చింది. అతడు ద్వారం గుండా లోపలికి పోయే సరికి, అది సుహాసిని పడక గదికి చేర్చింది.

ఈ వింత సారంగాన్ని గురించిన రహస్యం ఏమిటా అని చూడగా, సుహాసిని గది గోడలకి చుట్టూ ఎక్కడా సందు లేకుండా పై కప్పు నించి కింద నేలవరకూ అద్దాలు వున్నై. ఆ అద్దాలన్నింటిలోకీ ఒక అద్దం చాలా విచిత్రమైంది. నేల మీద ఒక చోట ఒక చిన్న మీట వుంది. దానిని నొక్కితే, ఆ అద్దం నేలలోకి దిగి పోయి, అక్కడ ఒక దార్వం ఏర్పడు



తుంది. ఆ ద్వారమే సారంగంలోకి దారి తీసింది. గదిలో వున్నట్టుగానే ద్వారం దాటగానే, సారంగం మొదటిలో కూడా ఒక చిన్న మీట వున్నది. అది నొక్కితే అద్దం మామూలుగా పైకి వచ్చి ద్వారం మూసుకుపోతుంది. మళ్ళీ మీట నొక్కితే అద్దం భూమిలోకి దిగిపోయి, ద్వారం కనిపిస్తుంది.

ఐతే, సుహాసిని రాజు గదికి ఎలా చేరుకున్నది. అనే ప్రశ్న ఒకటుంది. మామూలు ప్రకారంగా దాది, సుహాసినిని తన పక్కలో పడుకో బెట్టుకుని, నిద్ర పోతున్నది. ఒక రాత్రివేళ సుహాసినికి మెలుకువ వచ్చింది. ఆ పిల్ల ఏమీతోచక గదిలో అటూ యిటూ తిరుగుతూండగా, ఆమె కాలు అక్కడ నేల మీద వున్న మీట పైన పడింది. వెంటనే అద్దం భూమిలోకి దిగిపోవటం, అక్కడ ద్వారం తెరుచుకోవటం జరిగింది.

ఈ వింత చూసి సుహాసిని సారంగంలో ప్రవేశించి నడవగా, అది చివరికి రాజు శయనాగారంలోని పటం వెనుకకు చేర్చింది. చీకటిగా వుండటం చేత, అక్కడివరకే సారంగం వున్నదనీ, అది దాటి మరొక్క అడుగు వేస్తే, అక్కడ పటం వుందనీ సుహాసినికి తెలియలేదు. ఇంకా పోదామని ముందుకు నెట్టుకు పోయేసరికి, పటం సందిచ్చి, ఆ సందు లోంచి నిద్రిస్తున్న రాజు కనిపించాడు ఆమెకు. తక్షణమే సుహాసిని, తండ్రి వద్దకు పోవాలనే ఆత్రంతో ఎన్నో శ్రమలు పడి, బ్రహ్మాండమైన ఆ పటాన్ని ఒత్తిగించింది. ఆ తరవాత రాజు ఈ వింత సారంగంలో చిక్కుకొని, దారీ తెన్నూ తెలియక చాలాసేపు తిరిగాడు.

ఈ విధంగా వింత సారంగం యొక్క రహస్యమార్గం గురించి తెలుసుకున్న తర్వాత రాజుకి ఒక వంక సంతోషమూ, మరో వంక భయమూ కూడా కలిగినై. ఎవళ్ళకంటా పడకుండా, ఎలాగో భయ పడుతూ భయపడుతూ రాజు యీనాటి

వరకూ, తోటలో నించి భూగృహానికి వస్తూ పోతూ వున్నాడు. ఇప్పుడు ఈ సారంగ రహస్యం తెలియటం వల్ల, ఆ భయం తీరిపోయింది. ఇష్టం వచ్చినప్పుడల్లా తన గది నించి బ్రహ్మరుద్రులకు తెలియకుండా భూగృహంలోకి వచ్చి, తన పిల్లల్ని చూచుకోవచ్చు. ఈ అదృష్టానికి రాజు ఉప్పొంగిపోయాడు.



కాని, ఇప్పుడు రాజుకి మరొక భయం పట్టుకుంది. తగిన కట్టుబాటు చెయ్యకపోతే, యిప్పటిలాగే ఇక ముందు కూడా సుహాసిని గానీ, మిగతా పిల్లలు గానీ ఈ సారంగం లోనించి తన గది చేరుకోవటం, అక్కడి నించి బైటి ప్రపంచంలోకి రావటం జరగవచ్చు. అంతటితో తన జాగ్రత్త ఎందుకూ పనికిరాకుండా పోయి, పిల్లలు దక్కకుండా పోవచ్చు. అలా జరగకుండా వుండటానికి ఉపాయమేమిటా అని రాజు అదే పనిగా ఆలోచించసాగాడు.

రాజుకు చివరికి ఒక ఉపాయం తట్టింది. అది ఏమిటీ అంటె — ఇంతకు ముందు తన ముగ్గురు కుమార్తెలకు భూగృహంలో మూడు గదులు విడివిడిగా ఏర్పాటు చేసి, ఒక్కొక్కరిని, ఒక్కొక్క దాది సంరక్షణలో వుంచాడు. కాని ఇక మీదట ఈ మీట వున్న గదిలో ఎవరు సంచరించినా, తను తలచినట్టుగా ప్రమాదాలు కలగవచ్చుననే ఉద్దేశంతో, ఆ గది ఖాళీగా వుంచటానికే రాజు నిశ్చయించాడు. తన ముగ్గురు కుమార్తెలను తక్కిన రెండు గదులలోనే వుంచి కాపాడుతుండమని దాదులను హెచ్చరించాడు. వాళ్ళు అలాగే అన్నారు. అప్పటికి రాజు మనసు కుదుటబడింది.

రాజు కొంతసేపు ముగ్గురు కుమార్తెలతోనూ ముచ్చటలాడి, తర్వాత ఇంతకు ముందు సుహాసిని వుంటున్న అద్దాల గదిలోకి వచ్చాడు. మీట మీద కాలు వేసేసరికి, అద్దం భూమిలోకి దిగిపోయి ద్వారం ఏర్పడింది. ద్వారం గుండా



సారంగంలోకి వచ్చి, తిరిగి అక్కడ వున్న మీట కాలితో నొక్కేసరికి, మళ్ళీ ద్వారం మూసుకున్నది.

ఈ రహస్య మార్గం వున్నట్టు ఎలాగో తనకు తెలియజేసిన దేవుడికి నమస్కరిస్తూ, రాజు సంతోషంగా తిరిగి తన గదిలోకి వచ్చి చేరుకున్నాడు.

* * *

ఆ నాటి నుంచీ రాజు భూగృహంలోకి ఎన్నోసార్లు ధైర్యంగా వెళ్ళి వస్తూ వున్నాడు. క్రమంగా రోజులు గడుస్తున్నై. కాని తండ్రి తమని చూడటానికి వచ్చినప్పుడల్లా, రాకుమార్తెలు ముగ్గురూ తండ్రి కాళ్ళని చుట్టేసుకుని, "మేము కూడా నీతో వస్తాం, నాన్నా!" అని జాలిగా అడిగే వాళ్ళు.

రాజుకు తన కుమార్తెలను వెంట తీసుకు వెళ్ళగల ధైర్యంలేదు. అందుకని, "ఇప్పుడు కాదమ్మా, మరొకసారి తీసుకు వెళతాలే." అని సమాధాన పరుస్తూండేవాడు.

క్రమంగా నెలలు దొర్లిపోతున్నై. ముగ్గురు కుమార్తెలూ సురక్షితంగా పెరుగుతున్నందుకు రాజు మురిసిపోతున్నాడు. కాని అక్కడ రాణీ, ఒక్కొక రోజు గడిచిన కొద్దీ బెంగతో కృంగి కృశించి పోతున్నది. ఏమంటే, పిల్లల్ని వెతుక్కుంటూ వెళ్ళిన నౌకర్లలో చాలా మంది తెల్లమొగం వేసుకుని తిరిగి వచ్చేశారు. మధ్య మధ్య రాణీ, జ్యోతిష్కుణ్ణి పిలిపించి, "స్వామీ, పిల్లలు క్షేమంగా వున్నట్టేనా?" అని అడుగుతుండేది.

"ఉన్నారమ్మా. పిల్లలే కాదు, వాళ్ళను వెతకబోయిన ఆ వందమంది నౌకర్లు, పిల్లల వెంట వెళ్ళిన దాసీలూ కూడా క్షేమంగానే వున్నారు. మీరేమీ దిగులు పడకండి. కొద్ది రోజుల్లో అందరూ క్షేమంగా తిరిగి వచ్చే సూచనలు జాతకళలో స్పష్టంగా కనిపిస్తున్నై." అని చెబుతూండేవాడు జ్యోతిష్కుడు. అలా చెప్పి

నప్పుడు మనస్సులో తృప్తిపడి, కొద్ది రోజుల వరకూ రాణీ మళ్ళీ నిశ్చింతగా వుండేది.

ఈ విధంగా మరి రెండు సంవత్సరాలు గడిచినై. భూగృహంలోకి రహస్య సొరంగం ద్వారా రాజు రోజూ వెళ్ళి కుమార్తెలను చూచి వస్తున్నాడు. బిడ్డలు ముగ్గురూ సురక్షితంగానే వున్నారు. కాని రాజు భూగృహంలోకి వెళ్ళి నప్పుడల్లా పిల్లలు తమని బయటికి తీసుకు వెళ్ళమని గోలచేస్తూనే వున్నారు.

"మమ్మల్ని యిక్కడ ఎందుకు వుంచావు, నాన్నా? అమ్మని చూడాలి. అమ్మ దగ్గిరికి తీసుకెళ్ళూ...." అని ఏడుస్తూ, తండ్రికాళ్ళు చుట్టేసుకునే వాళ్ళు. వాళ్ళు అలా కన్నీరు కారుస్తూ వుండటం చూచినప్పుడల్లా, రాజు గుండె తరుక్కుపోయేది. "పోనీ ఒక్కసారి తీసుకుపోయి పిల్లల్ని రాణీకి చూపించుదామా?" అని పించేది. కాని అలా చేయటానికి ధైర్యం చాలేది కాదు. "ఏమైనా సరే యీ ఒక్క ఏడాదీ చలించ కూడదు?" అనుకున్నాడు రాజు. అందు చేతనే పిల్లలు ఎంత ఏడ్చినా, ఏదో విధంగా వాళ్ళని సముదాయించు కొంటూ కాలం వెళ్ళతోస్తున్నాడు.

ఇలా మరికొన్నాళ్ళు గడిచింది. మరొక్క నాలుగు రోజులకల్లా పిల్లలకు ఏడేళ్ళూ నిండుతై. ఆ నాటికి గండాలు గడిచి వాళ్ళు భూగృహం నించి విడుదల





కావచ్చు. "ఇప్పటి వరకూ, ఈ మూడు సంవత్సరాలలో పిల్లలకి ఏ విధమైన ఆపదా రాకుండా భూగృహంలో సురక్షితంగా కాపాడ గలిగానే, ఇకనే ముంది! నాలుగు రోజులు కాస్త జాగర్తగా వుంటే నాలుగేళ్ళూ నిండుతై. జాతకరీత్యా బిడ్డలు ప్రమాదం లేకుండా బ్రతికి బయట పడతారు," అను కొన్నాడు, రాజు సంతోషంగా.

యథాప్రకారం రాజు ఒకనాటి ఉదయాన్నే రహస్య మార్గం ద్వారా పిల్లల్ని చూడటానికి వచ్చాడు. బిడ్డలు భూగృహంలో వుండవలసిన గడువు ఆ నాటితో తీరిపోతుంది. పిల్లలు తండ్రిని చూడటం తోనే కాళ్ళకి చుట్టేసుకుని, "ఈ వేళ మమ్మల్ని బైటికి తీసుకు వెడితే కాని వీల్లేదు," అని పట్టుబట్టి మారాం చేస్తూ కూచున్నారు.

బిడ్డల దుఃఖం చూచి రాజు మనస్సు కరిగిపోయింది. "ఈ మూడు సంవత్సరాలూ ఏ ఆపదా రాలేదు గదా? ఇంకొక్క ఇరవైనాలుగు గంటలలో ఏమి రాబోతుంది? పైగా, ఇంత మంది పరివారం కాపుదల వుండగా అలాంటిది ఎలా జరుగుతుంది?" అని మనస్సుకు ధైర్యం తెచ్చుకుని, పిల్లలు ముగ్గురనూ వంద మంది నౌకర్లూ, ముగ్గురు దాసీలతో సహా భూగృహంలోంచి తోటలోకి తీసుకు వచ్చాడు. ముగ్గురు పిల్లల్ని దాసీలకి చూస్తూవుండమని వప్పగించి తనూ వాళ్ళ దగ్గిరే కూచున్నాడు.

పిల్లలకు, వందమంది నౌకర్లూ చుట్టూతా కాపలా వున్నారు. ఇన్నాళ్ళకు మళ్ళీ బయటి ప్రపంచం చూడగానే పిల్లలు ఎంతో సంతోషంగా గంతులు వేస్తూ తోటలో ఆడుకుంటున్నారు. వాళ్ళ ఆటలు చూచి రాజు ఎంతో మురిసి పోతున్నాడు.

ఇంతలో వున్నట్టుండి ఒక్కసారిగా బ్రహ్మాండమైన సుడిగాలి వచ్చింది. ఆ ప్రదేశమంతా దుమ్ముతో నిండింది.

అక్కడ వున్నవాళ్ళంతా ఒక్క క్షణం కన్ను మూశారు. మళ్ళీ కళ్ళు తెరిచే సరికి మూడు గద్దలు వచ్చి ముగ్గురు పిల్లల్నీ ఎత్తుకుపోవటం మాత్రం కనపడింది వాళ్ళకు. రాజు స్మృతితప్పి పడిపోయాడు. దాదులు రాజుకి పరిచర్య చేస్తున్నారు. నౌకర్లు వందమందీ ఆ గద్దలు పోయిన వైపుకి పరుగెత్తారు.

రాజుకి స్పృహవచ్చి, "నౌకర్లు ఏరీ?" అని అడిగేటప్పటికి, సరిగా అప్పుడే వాళ్ళు ఒకరి వెంట ఒకళ్ళు తెల్ల మొగాలు వేసికొని తిరిగిరావటం జరిగింది. సరీగా మూడు సంవత్సరాల క్రిందట రాజు ఏ కల్పిత వాక్కులు పలికి కపటనాటకం ఆడాడో, అది యీ నాడు అక్షరాలా తన కళ్ళ ఎదట జరిగే సరికి రాజు తనని తాను తిట్టుకున్నాడు.

''ఈనాడు యిలా యిలా జరగవలసి వున్నది గనుకనే, ఆనాడు ఏదో దుష్టగ్రహం నాలో ప్రవేశించి నా చేత అటువంటి అశుభవాక్కు పలికించింది. అందుకనే, 'నుదుట వ్రాయనిదే నోట పలికించ'దని అంటారు పెద్దలు,'' అనుకొంటూ రాజు కంటికీ మంటో... దుఃఖించసాగాడు.

ఐతే విధివిలాసము రాజు మనస్సు ఆ ప్రకారమే జరిగింది. నాడు సంవత్సమైన శక్తి ఏదో ప్రేరేపిగదా? ఇంకొక్క రాజుకి మనసుయొక్క కట్టుఏమి రాబో బిడ్డలను తోటలోకి తీసుకు ... బుద్ధి పుట్టింది. జరగవలసిన ప్రమాదమేమో జరిగింది. తీరా యిప్పుడు చేతులు కాలిన తర్వాత అకులు పట్టుకుందామనుకుంటే ఏమి లాభం?

ఇక యిప్పుడు రాణీ దగ్గిర ఈ విషయం దాచవలసిన పని ఏముందీ? రాజు పరివారంతో సహా మహలు చేరుకుని, చెప్పలేక చెప్పలేక ఈ వైనం రాణీతో చెప్పాడు. ఇంకేమున్నది రాజూ, రాణీ కూడా దుఃఖసముద్రంలో మునిగిపోయారు. —(ఇంకా వుంది)





# తండ్రికి తగిన కొడుకు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు ఎద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా, నీ లక్ష్యాన్ని సాధించటానికి అసాధారణమైన దీక్ష పూన్నావు. కాని ఎంతో ప్రయాసతో సాధించిన లక్ష్యాల వల్ల కూడా సత్ఫలితాలు కలగకపోవచ్చు. అందుకు నిదర్శనంగా నీకు తిరిగి అమరధ్వజుడి కథే చెబుతాను, శ్రమ తెలియకుండా విను.'' అంటూ ఇలా చెప్పసాగాడు :

అమరావతీనగరపు యువరాజు అమరధ్వజుడు ఒకసారి వేటాడుతూ కీకారణ్యం మధ్యకు వెళ్ళి, అక్కడ ఒక భిల్లకన్యను చూసి, ఆమెను మోహించి, ఆమెను పెళ్ళాడగలందులకు మహాబల

## బేతాళ కథలు



ఆమెకు అప్పుడు అమరధ్వజుడు ఒక్కడే. అందుచేత ఆమె అహోరాత్రాలు అతన్ని తన చెంతనే ఉంచుకోవటానికి ప్రయత్నించేది.

అమరధ్వజుడు కూడా ఆమెలో క్రమంగా మార్పు కలుగుతుందన్న ఆశతో తన కాలమంతా ఆమెతోనే గడుపుతూ వచ్చాడు. ఆమెను సంస్కారం గల దాన్ని చెయ్యటానికీ, నలుగురి మధ్యా స్వేచ్ఛగా తిరిగేటట్టు చెయ్యటానికీ అతనే స్వయంగా పాటు పడవలసి వచ్చింది. అయితే అతని ప్రయత్నాలు అంతగా ఫలించలేదు.

అమరధ్వజుడు ఇలా తన కాలమంతా తన భార్యతోనే గడుపుతూ ఉండటం చేత, అతనికి రాజ్యపాలనకు సంబంధించిన విషయాలు కొన్ని తెలియకుండా పోయాయి. వాటినన్నిటినీ మంత్రి స్వయంగా చూస్తూ వచ్చాడు.

శాలి అయిన ఒక భిల్లయోధుణ్ణి ఓడించి, ఆమెను తన నగరానికి తెచ్చి పెళ్ళి చేసుకున్నాడు.

కాని ఆ భిల్లయువతి అంతఃపురంలో అడుగు పెట్టిన తరవాత అనేక సమస్యలు బయలుదేరాయి. ఆమెకు రాజభవనం వాతావరణం బొత్తిగా కొత్త. రాజరికపు సంస్కారం ఆమెలో ఏ కోశానా లేదు. ఈ కొత్త జీవితంలో ఆమెకు ఎందరో ఉండి కూడా ఎవరూ లేనట్టే అయిపోయింది. ఆమె తన పరిచారికలతో మాట్లాడటానికి కూడా జంకేది; తన మందిరం దాటి ఎన్నడూ బయటికి వచ్చేది కాదు. ఈ ఖైదు లాటి జీవితంలో

అయితే, పొరుగుదేశపు రాజు అమరావతి పైన యుద్ధానికి సన్నాహాలు చేస్తున్నట్టు అమరధ్వజుడికి తెలియవచ్చింది. వెంటనే అతను అంతఃపురంలో నుంచి బయటికి వచ్చి, మంత్రులందరినీ సమావేశపరచి, రానున్న యుద్ధం గురించి చర్చలు సాగించాడు.

ఆ సమయంలో భిల్లయువతి అతన్ని వెతుక్కుంటూ అక్కడికి వచ్చి, "ఇంత

సేపు నన్ను ఒంటరిగా వదిలి ఇక్కడ ఏంచేస్తున్నావు? పోదాం పద!" అంటూ అతని చెయ్యి పట్టుకుని లాగింది.



ఇది చూసి అక్కడ ఉన్నవారు కొందరు నిర్ఘాంతపోయారు. కొందరు చాటుగా నవ్వుకున్నారు. అమరధ్వజుడికి భరించరాని అవమానం అయింది. అతను వెంటనే ఆమెతోబాటు అంతఃపురానికి వచ్చి, ఆమె మీద కేకలు వేస్తూ, "ఇంత కాలమూ నేను బోధించినదంతా బూడిదలో పన్నీరయింది. నాకు రాచకార్యాలుంటాయి. నేను నీ భర్తను మాత్రమే కాదు, ఈ దేశపు యువరాజును కూడా. నా వాళ్లమధ్యనే నువు నన్ను నవ్వులపాలు చేశావు. రేపు సాటిరాజుల మధ్య కూడా నవ్వుల పాలవుతాను. నిన్ను కోరి తెచ్చుకున్నందుకు అనుభవించవలసిందే గాని, నిన్ను మార్చటం నాకు సాధ్యం కాదు." అన్నాడు.

అతను ఏమంటున్నాడో కూడా ఆమెకు సరిగా అర్థం కాలేదు. తాను చేసిన తప్పేమిటో ఆమెకు తెలియలేదు. అతనికి కోపం రావటం చూసి ఆమె అతని కేసి పిచ్చిగా చూస్తూ ఉండిపోయింది.

అది మొదలు అమరధ్వజుడు రాత్రి వేళ తప్ప తన భార్యకు కనిపించటం మానేశాడు. నిజానికి అతనికి రాచకార్యాల ఒత్తిడి కూడా జాస్తిగానే ఉన్నది. త్వరలోనే యుద్ధం జరిగింది. యుద్ధంలో శత్రువులను అమరధ్వజుడు చిత్తుగా ఓడించాడు.

తన భర్త కనిపించటం తగ్గినాక భిల్ల యువతికి జీవితం పూర్తిగా ఖైదు లాగా అయిపోయింది. ఆమెకు తన పరిసరాల మీద మరింత అసహ్యం పుట్టింది. ఆమెలో కలిగిన ఈ మార్పు చూసి అమరధ్వజుడికి చాలా బాధ కలిగింది. కొత్త జీవితానికి ఆమె అలవాటు పడకపోగా, రాను రాను దానికి ఏ మాత్రమూ అంటకుండా పోతున్నదామె. ఆమెను భిల్లుల మధ్య నుంచి తెచ్చినందుకు అతను ఎంతో



పశ్చాత్తాపపడ్డాడు. ఆమె మీద జాలి పడ్డాడు. ఆమెను భిల్లుల వద్దకు తిరిగి పంపేద్దామన్నా, ఆమె ఇప్పుడు గర్భవతి!

అమరావతిలో ఏటా దసరావేడుకలూ, జాతరా జరిగేవి. జాతరలో రకరకాల బల ప్రదర్శనలు జరిగేవి. ఇలాటి బల ప్రదర్శనలలో పోటీలు కూడా ఉండేవి. వీటిలో కెల్లా అద్భుత ప్రదర్శన ఏదంటే అమరధ్వజుడు అతి ప్రాచీనమైన రాతి గదతో ఏనుగుతో యుద్ధం చేసి, దాన్ని చంపేవాడు. ఆ రాతిగద చాలా బరువైనది. దాన్ని పైకి ఎత్తటం కూడా అమరధ్వజుడికి తప్ప మరెవరికీ సాధ్యం అయేది కాదు.

ఈసారి ఉత్సవాలకు అమరధ్వజుడు తన వెంట తన భిల్ల భార్యను కూడా తీసుకువెళ్ళాడు. ఉత్సవం చూడటానికి జనం లక్షల సంఖ్యలో వచ్చారు. ఆ జనాన్ని చూసి భిల్లయువతి ఆశ్చర్య పడి, ''మేం కూడా జాతరలు జరుపుకుంటాంగాని ఇంతమంది రారు,'' అన్నది.

''వాళ్ళంతా నా బలప్రదర్శన చూడటానికి వచ్చినవాళ్ళు. అటువంటి ప్రదర్శన నువు ఎన్నడూ చూసి ఉండవు. కొద్ది సేపట్లో చూస్తావు,'' అన్నాడు అమరధ్వజుడు.

ప్రదర్శనలు చూడటానికి రాజకుటుంబం వారికీ, ఇతర ముఖ్యులకూ ఎత్తున కూర్చునే ఏర్పాట్లు చేశారు. అమరధ్వజుడు రంగంలోకి రాగానే అందరూ విజయధ్వానాలు చేశారు. అతను రాతిగదను అవలీలగా ఎత్తాడు. మదపుటేనుగును అతని ముందుకు తెచ్చారు. ఏనుగుకూ, అమరధ్వజుడికీ భయంకరమైన పోరాటం జరిగింది. ఏనుగు దిక్కులు పగిలేటట్టు ఘీంకరిస్తూ, అతన్ని తొండంతో పట్టటానికి ప్రయత్నించింది. కాని త్వరలోనే అతను ఏనుగును చంపేశాడు.

అమరధ్వజుడి మీద పుష్పవర్షం కురిపించారు. అతను తన భార్య కేసి

చూసేసరికి ఆమె విరగబడి నవ్వుతున్నది. అతను ఆమె దగ్గరికి వచ్చి, "ఎందుకు నవ్వావు?" అని అడిగాడు.

"నువు ఏం గొప్ప పని చేశావని ఈ జనం ఇలా శివం ఎత్తి పోతున్నారు?" అని భిల్లయువతి అతన్ని అడిగింది.

"ఆ రాతి గదను మానవమాత్రు లెవరూ ఎత్తలేరు. నేను దాన్ని ఎత్తటమే గాక, దానితో ఏనుగును చంపాను. ఇది విడ్డూరం కాదా?" అని అమరధ్వజుడు అడిగాడు.

"ఆ రాతి గదను ఇంకెవరూ ఎత్త లేరంటావా?" అని ఆమె అడిగింది.

"దాన్ని ఎత్తిన వాడికి నా రాజ్యం ఇచ్చేస్తాను," అన్నాడు అమరధ్వజుడు.

భిల్లయువతి ఆశ్చర్యపోయి, "దాన్ని ఎత్తగల వాళ్ళు మా గూడెంలో చాలా మంది ఉన్నారు," అన్నది.

"ఉంటే వెళ్ళి తీసుకురా. ఇప్పుడే మీ గూడానికి వెళ్ళు. రాతి గద ఎత్తగల వాణ్ణి వెంటపెట్టుకుని మరీ రా. తీసుకు రాలేకపోతే నువు తిరిగి రానవసరం లేదు," అన్నాడు అమరధ్వజుడు తన భిల్ల భార్యతో.

అతను తన భార్యను అప్పటికప్పుడే గూడానికి తిప్పి పంపేశాడు. ఆమె తిరిగి రాలేదు.



పదిహేను సంవత్సరాలు గడిచాయి. ఏటా దసరా ఉత్సవాలూ, జాతరా, వేడుకలూ జరుగుతూనే ఉన్నాయి. ప్రతి ఏడూ అమరధ్వజుడు రాతిగదతో ఏనుగును చంపుతూనే ఉన్నాడు.

పదహారో ఏడు అతను రాతి గదతో ఏనుగును చంపిన వెంటనే జనంలో నుంచి ఒక భిల్లయువకుడు, "మహారాజా, నేను ఆ రాతి గదను ఎత్తగలనేమో చూడనిస్తారా?" అన్నాడు.

అమరధ్వజుడు ఆ కుర్రవాడి కేసి ఒక క్షణం చూసి, "ఎత్తగలవేమో చూడు! దాన్ని ఎత్తితే నా రాజ్యమే నీ కిచ్చేస్తాను," అన్నాడు.

చూసేసరికి ఆమె విరగబడి నవ్వుతున్నది. అతను ఆమె దగ్గరికి వచ్చి, "ఎందుకు నవ్వావు?" అని అడిగాడు.

"నువు ఏం గొప్ప పని చేశావని ఈ జనం ఇలా శివం ఎత్తి పోతున్నారు?" అని భిల్లయువతి అతన్ని అడిగింది.

"ఆ రాతి గదను మానవమాత్రు లెవరూ ఎత్తలేరు. నేను దాన్ని ఎత్తటమే గాక, దానితో ఏనుగును చంపాను. ఇది విడ్డూరం కాదా?" అని అమరధ్వజుడు అడిగాడు.

"ఆ రాతి గదను ఇంకెవరూ ఎత్త లేరంటావా?" అని ఆమె అడిగింది.

"దాన్ని ఎత్తిన వాడికి నా రాజ్యం ఇచ్చేస్తాను," అన్నాడు అమరధ్వజుడు.

భిల్లయువతి ఆశ్చర్యపోయి, "దాన్ని ఎత్తగల వాళ్ళు మా గూడెంలో చాలా మంది ఉన్నారు," అన్నది.

"ఉంటే వెళ్ళి తీసుకురా. ఇప్పుడే మీ గూడానికి వెళ్ళు. రాతి గద ఎత్తగల వాణ్ణి వెంటపెట్టుకుని మరీ రా. తీసుకు రాలేకపోతే నువు తిరిగి రానవసరం లేదు," అన్నాడు అమరధ్వజుడు తన భిల్ల భార్యతో.

అతను తన భార్యను అప్పటికప్పుడే గూడానికి తిప్పి పంపేశాడు. ఆమె తిరిగి రాలేదు.



పదిహేను సంవత్సరాలు గడిచాయి. ఏటా దసరా ఉత్సవాలూ, జాతరా, వేడుకలూ జరుగుతూనే ఉన్నాయి. ప్రతి ఏడూ అమరధ్వజుడు రాతిగదతో ఏనుగును చంపుతూనే ఉన్నాడు.

పదహారోఏడు అతను రాతి గదతో ఏనుగును చంపిన వెంటనే జనంలో నుంచి ఒక భిల్లయువకుడు, "మహారాజా, నేను ఆ రాతి గదను ఎత్తగలనేమో చూడనిస్తారా?" అన్నాడు.

అమరధ్వజుడు ఆ కుర్రవాడి కేసి ఒక క్షణం చూసి, "ఎత్తగలవేమో చూడు! దాన్ని ఎత్తితే నా రాజ్యమే నీకిచ్చేస్తాను," అన్నాడు.

వెంటనే ఆ భిల్లయువకుడు ఆ రాతి గదను పైకెత్తి గిరగిరా తిప్పి పైకి ఎగరేశాడు. ఆ కుర్రవాడి బలం చూసి అమరధ్వజుడు కొయ్యబారి పోయాడు.

అప్పుడు భిల్లయువతి ముందుకు వచ్చి, "చూశారా, మా గూడెంలో మీ కన్న బలవంతులున్నారు!" అని అమరధ్వజుడితో అన్నది. ఆమె తన భార్యేనని అమరధ్వజుడు పోల్చుకో గలిగాడు. ఆ యువకుడు కూడా తన కొడుకే నని తెలిసిన మీదట అతను చాలా సంతోషించి, ఆమెను అవమానించినందుకు క్షమాపణ చెప్పుకున్నాడు.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, భిల్లయువతి తన గూడెంలో రాతి గద ఎత్తగల వాళ్ళు చాలా మంది ఉన్నారని చెప్పి కూడా, పదిహేనేళ్ళ పాటు ఎవరినీ ఎందుకు తీసుకురాలేదు? ఆమె అబద్ధం ఆడినట్టు స్పష్టమైన తరవాత కూడా అమరధ్వజుడు ఆమెకు క్షమాపణ ఎందుకు చెప్పుకున్నాడు? ఈ సందేహాలకు సమాధానం తెలిసి కూడా చెప్పక పోయావో నీతల పగిలిపోతుంది." అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "ఆటవికులు అబద్ధాలాడరు. ఇతరులలో ఉండే బలాన్ని ఎప్పుడూ మెచ్చుకుంటారు. భిల్లయువతి అబద్ధం ఆడలేదు. తన భర్తకన్న బలశాలులు గూడెంలో నిజంగా ఉన్నారు కనకనే ఆమె అలా అన్నది. వాళ్ళను తెచ్చి తన భర్తకు రాజ్యం లేకుండా చెయ్యటం ఇష్టం లేక, తన కొడుకు పెరిగి పెద్దవాడైన దాకా ఆమె వేచి ఉండి, తన భర్తను మించిన బలశాలులు గూడెంలో ఉన్నట్టు రుజువు చేసింది. తన రాజ్యాన్ని తన కొడుకుకే దక్కేటట్టు చేసిందన్న కృతజ్ఞతతో అమరధ్వజుడు జరిగిన దానికి క్షమాపణ చెప్పుకున్నాడు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు.

—(కల్పితం)





# వృత్తిదేవత

చాలా ఏళ్ళ క్రితం చీనా లోని ఒక గ్రామంలో చాంగ్ లా అనే టోపీల వ్యాపారి ఉండేవాడు. టోపీలు తయారు చెయ్యటం అతనికి వంశపారంపర్యంగా వస్తున్న వృత్తి. చాంగ్ లా తండ్రి ఈ వృత్తిలో గని ఆస్తి సంపాదించి, చనిపోతూ పీల వృత్తిని మానవద్దని చెప్పాడు.

కాని తండ్రి పోయిన తరవాత చాంగ్ లాకు, అంత ఆస్తి పెట్టుకుని టోపీల వృత్తి చెయ్యటం ఇష్టం లేకపోయింది. అయినా, ఉన్నట్టుండి ఆ వృత్తి మానేస్తే "వృత్తి దేవత" కు కోపం రావచ్చునని అతనికి కొద్దిగా భయం మాత్రం ఉండేది. అతను వృత్తి మానుకోవటానికి బదులు, టోపీలను నిర్లక్ష్యంగా కుట్టి, హెచ్చు ధర అడగ నారంభించాడు. గ్రామస్థులకు అసహ్యం పుట్టి, పక్క గ్రామం నుంచి వాంగ్ లా అనే వాణ్ణి తెచ్చుకున్నారు.

వాంగ్ లా కుచ్చు టోపీలు కుట్టటంలో నేర్పరి. అతను టోపీలతో బాటు రకరకాల సంచులు కూడా కుట్టేవాడు. అతను చాంగ్ లా దుకాణానికి ఎదురుగానే తన దుకాణం ఏర్పాటు చేసుకున్నాడు. అందరూ వాంగ్ లా టోపీలే కొనసాగారు.

ఒకనాడు చాంగ్ లా తన దుకాణంలో విశ్రాంతిగా కూర్చుని, వాంగ్ లా దుకాణం లోకి ఒక సన్యాసి వెళ్ళటం చూశాడు. ఆ సన్యాసి వద్ద బంగారంలాగా మెరుస్తున్న జింకచర్మం ఉన్నది. ఆయన దాన్ని వాంగ్ లా కిచ్చి, దానితో ఒక జోలె కుట్ట మని చెప్పి, వెళ్ళిపోయాడు.

వాంగ్ లా ఆ రోజు అంతా పని చేసి, సన్యాసికి కావలసినట్టుగా జోలె కుట్టి, దాన్ని దుకాణంలో గోడకు తగిలించాడు.

అయితే మర్నాటి నుంచీ వాంగ్ లా గ్రామస్థులకు డబ్బు తీసుకోకుండా

చెబియ్యం లక్ష్మీనారాయణ

టోపీలు ఇయ్యటమూ, సన్యాసులకు విందులు చెయ్యటమూ మొదలుపెట్టాడు.

నిన్నగాక మొన్న వచ్చిన వాంగ్ లా యిలా దానధర్మాలు చేయటంలో ఏదో రహస్యం వున్నదనీ, అది తెలుసుకోవాలనీ చాంగ్ లా అనుకున్నాడు.

ఒకనాడు వాంగ్ లా తన దుకాణం మూయగానే చాంగ్ లా అతని దుకాణం వద్దకు వెళ్ళి, తలుపు సందునుంచీ లోపలికి చూశాడు. లోపల వాంగ్ లా సన్యాసి కోసం తయారుచేసిన జోలెను దులుపుతున్నాడు. దాని నుంచి బంగారు నాణాలు జలజలా రాలుతున్నాయి.

చాంగ్ లా తన కళ్ళను తానే నమ్మలేక పోయాడు. మర్నాడు కూడా అలాగే చూసేసరికి ఆ జోలె కాజెయ్యాలని చాంగ్ లాకు దుర్బుద్ధి పుట్టింది.

మర్నాడు వాంగ్‌లా తన దుకాణంలో నుంచి లోపలికి ఏదో పని మీద వెళ్ళిన సమయంలో చాంగ్ లా అతని దుకాణం లోకి వెళ్ళి, గోడకు ఉన్న జోలె తీసుకుని, దాని స్థానంలో నకిలీ జోలె ఒకటి తగిలించి తన దుకాణానికి తిరిగి వచ్చాడు.

ఆ రోజు చీకటి పడినాక చాంగ్ లా తన దుకాణం మూసి, తాను దొంగిలించి తెచ్చిన జోలెను దులిపాడు. దాని నుంచి బంగారు నాణాలు పడకపోగా, చాంగ్ లా ఇంట ఉండిన బంగారు వస్తువులు మాయమయాయి.

చాంగ్ లా హతాశుడై, వాంగ్ లా వద్దకు వెళ్ళి, జరిగిన సంగతి చెప్పి, తనను రక్షించమని వేడుకున్నాడు. జనం చాలా మంది పోగయారు. ఆ జనం మధ్య నుంచి వెనకటి సన్యాసి వచ్చి, ''చాంగ్ లా, నీకు నీ వృత్తిలో నమ్మకం లేదు. ఇక ఆ జోలె నీకు శాశ్వతం!" అని చెప్పి అదృశ్యమయాడు.

అంతే, ఆ రోజునుంచీ చాంగ్ లా ఆ జోలె భుజానికి తగిలించుకుని, ముష్టెత్తుకుని జీవించాడు. ఈ వార్త దేశమంతా పాకిపోయింది. ''వృత్తిదేవత'' ఆ సన్యాసి రూపంలో వచ్చినట్టు చెప్పుకున్నారు.



# 154. తెల్లఏనుగులు

ఐరావతం తెల్లఏనుగు అంటారు. ఏనుగులలో పాలిపోయి, రంగులేని చర్మంగల "అల్బినో" ఏనుగులు ఉన్నాయి. సయామ్‌దేశంలో వాటిని చాలా పవిత్రంగా చూస్తారు. అలాటి ఏనుగులలో బుద్ధుడి ఆత్మ ఉంటుందని వారి నమ్మకం. అడవుల నుంచి తెల్ల ఏనుగులను పట్టి తెచ్చినప్పుడు బౌద్ధపూజారులు దాని వద్దకు వచ్చి, "నువ్వు తిరిగి అడవికి వెళ్ళవద్దు. అక్కడ నీకు సేవకులు లేరు. దుమ్ములో పడుకోవటం మంచిది కాదు," అంటూ చెబుతారు. ఒక సయామ్‌రాజు తనకు గిట్టని భృత్యుడికి ఒక తెల్ల ఏనుగును బహూకరించాడట. అతడు దాని పోషణతో దివాలా తీశాడు.





# ఇంటిదొంగలు

చంద్రతల మనే రాజ్యాన్ని వీరపాలుడు అనే రాజు పాలించేవాడు. తన ప్రజలు సుఖంగా జీవించటానికీ, తన పరిపాలనలో ధర్మం పూర్తిగా అమలు జరగటానికీ అతను ఎన్నో ఏర్పాట్లు చేశాడు. అతని రాజ్యమంతటా ప్రజల సౌకర్యాలు చూడటానికి అధికారులు నియమించబడ్డారు. ప్రజల సమస్యలను తెలుసుకొని, వాటికి పరిష్కార మార్గాలు చూడటం వారి పని. దేశమంతటా తిరిగి, పరిపాలన సరిగా సాగుతున్నదీ లేనిదీ తెలుసుకుని, తనకు తెలియబరచటానికి ఒక సంచార సలహాదారును కూడా నియమించాడు రాజు.

సంచార సలహాదారు రాజ్యంలోని వేరు వేరు ప్రాంతాలలో పర్యటించి వచ్చి, తాను చూసిన ప్రాంతం సకల సంపదలతోనూ, సౌభాగ్యాలతోనూ తులతూగుతూ ఉన్నట్టు, రాజుగారు కోరినట్టే అక్షరాలా ప్రజాపాలన సాగుతూ ఉన్నట్టూ చెప్పేవాడు. అలాగే ప్రాంతీయాధికారులు మూడు నెలల కొకసారి వచ్చి, రాజుగారికి నివేదికలు సమర్పించుతూ, తమ తమ ప్రాంతాలలో పరిపాలన ఎలా సాగుతున్నదో, అక్కడ కొత్తగా చెయ్యవలసిన ఏర్పాట్లూ, సౌకర్యాలూ ఏవో, వాటికి అదనంగా ఎంత ఖర్చు అవుతుందో తెలిపి, రాజుగారి నుంచి ద్రవ్యమూ, అనుమతీ పొందే వారు.

రాజు ఇంతటితోనే తృప్తి చెందక, ఏడాది కొకసారి తన దేశమంతటా గల గ్రామాధికారుల నందరినీ రాజధానికి ఆహ్వానించి, మూడు రోజులపాటు వారికి విందులు చేసి, ఒక్కొక్కడికి సువర్ణం బహూకరిస్తూ, "కుశలమా? నీ గ్రామస్థులు కుశలమా?" అని అడిగేవాడు.

ఎస్. వీరభద్రరావు

"అంతా కుశలమే, మహారాజా. తమ వంటి చల్లని ప్రభువులుండగా మాకు కుశలం కాక ఏమిటి?" అని ప్రతి ఒక్కడూ చెప్పేవాడు.

రాజు ఏ ప్రాంతానికైనా వెళ్ళినప్పుడు ఆయనకు బ్రహ్మాండమైన స్వాగతం లభించేది. ప్రజలు జయజయ ధ్వానాలు చేసేవారు. దేశం ఎంతో సుభిక్షంగా ఉన్నట్టు కనబడేది.

ఇలా ఉండగా ఒక ఏడు రాజుగారు గ్రామాధికారుల సంతర్పణ జరిపించేటప్పుడు అక్కడ జరిగే విందుకు ఒక ముసలి సన్యాసి వచ్చాడు. అందరితో బాటు ఆయనకూ వడ్డన చేశారు. కాని ఆ సన్యాసి తన ముందున్న విస్తరి ఆకులో వడ్డించిన పదార్థాలనన్నిటినీ నేలమీదికి తోసేసి; ఆకుకు అంటిన పదార్థాలను నాకి చప్పరించాడు. భోంచేస్తున్న వారందరూ సన్యాసిని వింతగా చూశారు. విస్తరి చినిగిన దాకా అలాచేసి సన్యాసి లేచి పోయాడు.

ఈ సంగతి రాజుకు తెలిసి, సన్యాసిని పిలిపించి, "భోజనానికని వచ్చి భోజనం చెయ్యకుండానే వెళ్ళిపోతున్నారేం? ఇలా చేయుటం నన్ను అవమానించటానికా? మరేదైనా కారణం ఉన్నదా?" అని అడిగాడు.

"ఇందులో మీకు అవమానం ఏమీ లేదు. నేను దేశాలన్నీ చుట్టి ఇక్కడికి వచ్చాను. ఈ దేశమంత హీనమైన దేశం



నే నెక్కడా చూడలేదు. నీ అధికారులు నీ దేశ ప్రజలను పీల్చి పిప్పిచేస్తున్నారు. ఎంత కష్టపడి సంపాదించినా పన్నులు చెల్లించటానికే సరిపోవటంచేత నీ ప్రజలు ఎంగిలాకులు తిని బతుకుతున్నారు. వారి పరిస్థితి చూచిన నాకు నీ విందుభోజనం ఎలా నోట పట్టుతుంది? ఈ విందు నీ ప్రజలకు తీరని అవమానం. నువు గ్రామాధికారులకు చేసే సువర్ణ దానం నీ ప్రజలకు ఏ విధంగా ఉపయోగిస్తుంది? నీ అధికారులు లంచాలు మరిగి, అవినీతి పరులై క్షేమంగా వున్నారు. వారు నీకు ప్రజలగోడు ఎందుకు చెబుతారు? నీ నుంచి కూడా వాళ్ళకు లంచమే ముట్టుతున్నది. నీ నుంచి లంచం పుచ్చుకుని వీళ్ళు నిన్ను పొగడుతారు. నువు తృప్తి చెందుతావు." అంటూ సన్యాసి వెళ్ళిపోయాడు.

ఈ మాటలు విని రాజు దిగ్భ్రమ చెందాడు. ఆయన అనుకున్నదంతా తారుమారు అయింది. ఆయన వెంటనే అన్ని ప్రాంతాలకూ తగిన గూఢచారులను పంపి, సన్యాసి అన్న మాటలలో అతిశయోక్తి ఏమీ లేదని తెలుసుకున్నాడు. ఆ గూఢచారులే అధికారులలో లంచగొండులనూ, అవినీతిపరులనూ రాజుకు పట్టి ఇచ్చారు. సంచార సలహాదారు అందరినీ మించిన అవినీతి పరుడనీ, అతను ఆ ఉద్యోగంలో అంతులేని ధనం పోగుచేశాడనీ స్పష్టమయింది.

రాజు అవినీతిపరుల నందరినీ వారి హోదాల ప్రమాణంలో శిక్షించి, వారు అక్రమంగా సమకూర్చుకున్న ఆస్తులను స్వాధీనపరచుకుని, కొత్త అధికారులను నియమించి, వారిని కనిపెట్టి ఉండటానికి గూఢచారులను నియమించాడు. అప్పుడప్పుడూ మారువేషంలో తాను స్వయంగా వేరు వేరు ప్రాంతాలకు వెళ్ళి, జనసామాన్యం మధ్య తిరుగుతూ, తన రాజ్యంలో అవినీతి పూర్తిగా నిర్మూలించి, ఆదర్శ పరిపాలన కొనసాగేటట్టు చూశాడు.





విడిచి పెట్టటం వాడికి అవసరం అని పించింది. వాడు ఊరు దాటి, అడవిలో ప్రవేశించి చాలా దూరం నడిచాడు. ఒక చోట ఒక చెట్టు కింద ఒక మనిషి పడుకుని నిద్రపోతూ వాడికి కనిపించాడు. ఆ నిద్ర పోయే మనిషి పక్కన ఒక పెద్ద కత్తి, ఒక మూటా ఉన్నాయి.

శివనాధుడు ఆ మూట విప్పి చూశాడు. దాని నిండా బంగారు నాణాలు కన బడ్డాయి. శివనాధుడికి జ్యోతిష్కుడి మాటలు జ్ఞాపకం వచ్చాయి. వాడు సందేహించకుండా, ఆ మూటనూ, కత్తినీ తీసుకుని, కాలిసత్తువ కొద్దీ పరిగెత్త సాగాడు.

ఇంతలోనే, చెట్టు కింద నిద్రపోతున్న వాడు లేచి, జరిగిన సంగతి గ్రహించి, పెద్దగా అరుస్తూ శివనాధుణ్ణి తరుము కుంటూ వచ్చాడు.

శివనాధుడు వెనక్కు తిరిగి చూసి, యిక ఆ మనిషికి అందకుండా పారిపోలే మని గ్రహించి నిలబడ్డాడు. ఇంతలో ఆ మనిషి దగ్గిరికి రానే వచ్చాడు. శివ నాధుడు తన వద్ద ఉన్న కత్తితో అతణ్ణి ఒక్క పోటు పొడిచాడు. ఆ మనిషి పెద్ద కేక పెట్టి కూలిపోయాడు.

ఆ మనిషి కొద్దిసేపు కాళ్ళూ, చేతులూ కొట్టుకుని ప్రాణం వదలటం శివనాధుడు చూసి, కొయ్యబారి పోయాడు. తాను దొంగతనమే గాక హత్య కూడా చేశాడు. ఏమైనా వాడు తనకు చిక్కిన బంగా రాన్ని మాత్రం వదల దలుచుకోలేదు. ఆ శవం దగ్గిర నుంచి సాధ్యమైనంత వేగంగా ముందుకు సాగిపోయి, మరొక గంట కల్లా అడవిదాటి, ఒక ఊరు చేరాడు.

ఆ ఊళ్ళో వాడికి ఎదురైన మొట్ట మొదటి మనిషి, "నీ అంగీ నిండా ఆ రక్తం ఏమిటి?" అని అడిగాడు.

అంత దాకా తన అంగీ మీద రక్తం మరక లున్నట్టు ఎరగని శివనాధుడు తడుపుకో కుండా, "ఎవడో దొంగ నా

సొమ్ము కాజెయ్యాలని చూశాడు. కత్తితో పొడిచాను," అని బొంకాడు.

క్షణంలో ఈ వార్త ఊరంతా పాక్కింది. పదిమందీ చేరి శివనాధుడు చెప్పిన చోటికి వెళ్ళారు. చచ్చిపోయిన వాడు "కాలయముడు" అని పేరు మోసిన గజదొంగ! వాణ్ణి చంపిన వారికి పదివేల వరహాలు బహుమానం ఇస్తానని కూడా రాజు ప్రకటించి ఉన్నాడు. ఈ సంగతి ప్రజలు శివనాధుడికి చెప్పి జయ జయ ధ్వానాలతో తమ గ్రామానికి తీసుకు వచ్చారు. అతనికి ఒక ఊరంటూ లేదని తెలుసుకుని, వాళ్ళు అతన్ని తమ గ్రామంలోనే ఉండి పొమ్మన్నారు. అనేక ఇళ్ళుగల సంపన్నుడు ఒకాయన శివనాధుడికి ఒక చిన్న ఇంటిని ఉచితంగా ఇచ్చేశాడు. త్వరలోనే అతనికి రాజుగారి బహుమతి కూడా అందింది.

ఇప్పుడు శివనాధుడి దగ్గిర మూల ధనం చాలా ఉన్నది. కాని గొప్పవాడు కావటానికి అది చాలదు. ఇంకా ధనం సంపాదించటానికి అతను వ్యాపారం చేయ దలచుకుని, కొన్ని గేదెలను కొని పాలవ్యాపారం ప్రారంభించాడు. ఈ వ్యాపారం లాభ సాటిగా ఉన్నది. ఇంకా అధిక లాభాల కోసం అతను పాలలో నీళ్ళు కలిపి అమ్మసాగాడు.



అయితే ఈ వ్యాపారానికి ఒక చిన్న అంతరాయం వచ్చింది. అదేమంటే, శివనాధుడు ఉండే ఊరికి నీటి సౌకర్యం లేదు. గ్రామస్థులకు దూరాన ఉండే ఏరే ఆధారం. చాలా మంది ఏటికి వెళ్ళి నీరు తెచ్చు కుంటారు. తెచ్చుకోలేని వాళ్ళు హెచ్చుకూలీ ఇచ్చి నీరు తెప్పించు కుంటారు. శివనాధుడి పాలవ్యాపారం పెరిగిన కొద్దీ నీరు హెచ్చుగా కావలసి వచ్చింది. హెచ్చుకూలీ ఇచ్చి నీరు కొని పాలలో కలిపితే లాభం తరిగిపోతుంది. అదీగాక, శివనాధుడు నీరు విస్తారంగా కొంటే, అతను పాలలో నీరు కలుపు తున్న సంగతి బయట పడిపోతుంది.



అందుచేత శివనాధుడు తన దొడ్లోనే ఒక బావి తవ్వించాలనుకున్నాడు. ఈ పని రహస్యంగా జరగాలి గనక, అతను పొరుగూరి నుంచి కూలీలను రప్పించి, బావి తవ్వించాడు. అతని అదృష్టం ఇందులో కూడా బయట పడింది. ఆ ఊరిలో ఎవరు బావి తవ్వించినా ఎన్నడూ నీరు పడలేదు, కాని శివనాధుడికి పది అడుగుల లోతునే తియ్యని నీరు పడింది. బావి తవ్వకం పూర్తికాగానే అతను కూలీలను రహస్యంగా పంపేశాడు. అతనికి నీరు కొనుక్కునే అవసరం తప్పిపోయింది. అయితే అతను తన ఇంటి అవసరాలకు కొద్దిపాటి నీరు ఇంకా కొంటూనే ఉన్నాడు.

అయినా, శివనాధుడు అమ్మే పాలను గురించి గ్రామస్థులకు అనుమానం కలిగింది. అది బర్రెల తీరు అని అతను అంటే వాళ్ళు నిజమే కాబోలుననుకున్నారు. కాని అతని పాలు ఏమాత్రమూ బాగుండటం లేదు. శివనాధుడి పోటీకి తట్టుకోలేక, లోగడ ఆ గ్రామంలో పాల వ్యాపారం చేసినవారంతా ఊరు విడిచి వెళ్ళిపోయారు. అందుచేత ఇప్పుడు ఊరి వాళ్ళకు శివనాధుడు తప్ప మరోగతిలేదు.

ఈ పరిస్థితిలో, ఊళ్ళో ఉండే రాముడు అనే ఒక యువకుడూ రాజుగారి దగ్గిరికి వెళ్ళి, శివనాధుడి మీద ఫిర్యాదు చేస్తూ, శివనాధుడు చాలా పలుకుబడి గలవాడనీ, దర్యాప్తు వీలయినంత రహస్యంగా జరపమనీ వేడుకున్నాడు. రాజుగారి గూఢచారి ఒకడు శివనాధుడి మోసం కనిపెట్టాడు.

శివనాధుణ్ణి పట్టితెప్పించి, న్యాయస్థానంలో నిలబెట్టి, "నువు పాలవ్యాపారంలో దారుణమైన కల్తీ చేస్తున్నట్టు రుజువయింది. దీనికి నీ సంజాయిషీ ఏమిటి?" అని రాజు అడిగాడు.

"నేను చేసిన కల్తీ ఏమిటొ సెలవియ్యండి," అన్నాడు శివనాధుడు.

"నువు పాలలో నీళ్ళు కలిపావు," అన్నాడు రాజు.

"నేను పాలలో నీళ్ళు కలపలేదు, నీళ్ళలోనే పాలు కలిపాను. కావలిస్తే తెప్పించి చూడండి. నేను అమ్మే నీళ్ళలో పాల కన్న నీళ్ళే ఎక్కువ!" అన్నాడు శివనాథుడు.

న్యాయస్థానంలో అందరూ గొల్లుమన్నారు.

"అది మరింత అక్రమం!" అన్నాడు రాజు కోపంగా.

"నేను నీళ్ళవ్యాపారినే గాని పాల వ్యాపారిని కాను. మా ఊరిప్రజల ప్రధాన అవసరం నీరు. దానికోసం ఎంతో డబ్బు ఖర్చు పెడుతున్నారు," అన్నాడు శివనాథుడు.

అతను ఇలా అనగానే ఆ వూరి గ్రామ పెద్ద రాజుతో, "ఆ మాట నిజమే, మహారాజా! శివనాథుడు సామాన్యుడు కాడు, కాలయముడి బారినుంచి మమ్మల్ని కాపాడిన మహానుభావుడు! అటువంటి వాడు కల్తీ వ్యాపారానికి దిగుతాడంటే నమ్మశక్యం కాదు. మా ఊరి నీటి ఎద్దడి గురించి మీకు తెలిసి రాగలందులకు ఇలా చేశాడని తోస్తుంది," అన్నాడు.

ఈ మాట విని రాజు మండిపడి, "అయితే, ఇంత కాలమూ మీరు ఏం చేస్తున్నారు? నాకు విజ్ఞప్తి ఎందుకు చేసుకోలేదు?" అని అడిగాడు.

"చాలా విజ్ఞాపనలు చేసుకున్నాం, మహారాజా. కాని మీ అధికారులకు ప్రజల నేరాలను విచారించటంలో ఉన్న అసక్తి, ప్రజల విన్నపాలను పరిశీలించటంలో లేదు," అన్నాడు గ్రామాధికారి.

రాజు శివనాథుణ్ణి వెంటనే విడుదల చేసి, అతనికి అభినందనలూ, బహుమతులూ ఇచ్చాడు. తరవాత నది నుంచి, శివనాథుడు ఉండే ఊరి మీదుగా ఒక కాలువ తవ్వించారు. శివనాథుడి దయ వల్లనే తమకు ఆ కాలువ వచ్చిందని ఊరి వాళ్ళంతా అనుకున్నారు. శివనాథుడు కీర్తి ప్రతిష్ఠలతో బాటు కోట్లకొద్దీ ధనం ఆర్జించి, పెళ్ళి చేసుకుని, వక్రమార్గాలు వదిలిపెట్టి, సుఖంగా జీవించాడు.





# మూడు పిశాచాలు

ఒక అమావాస్య నాటి అర్ధరాత్రి ఒక ముసలి మగపిశాచం కొత్తగా ఒక శ్మశానం కేసి వచ్చింది. అక్కడ ఒక పాడుబడిన సమాధి దగ్గిర ఒక కుర్ర ఆడపిశాచి నృత్యం చేస్తున్నది. ముసలి మగపిశాచి ఆ నృత్యాన్ని మెచ్చుకున్నది.

కుర్రపిశాచి ముసలిపిశాచి కేసి పరకాయించి చూసి, "నిన్నిదివరకు చూసినట్టు లేదు. నువు ఈ వైపు కొత్తగా వచ్చినట్టున్నావే?" అన్నది.

"అవును. మనం జట్టుగా ఉందాం. నువు నాకు చూడవలిసినదంతా చూపించు," అన్నది ముసలిపిశాచి.

కుర్రపిశాచి ముసలిపిశాచికి సమాధులన్నీ చూపించి, వివరాలు చెబుతూ బయలుదేరింది. రెండు పిశాచాలూ శ్మశానం అంతా తిరుగుతూ ఒక చెట్టు కిందికి వచ్చేసరికి, అక్కడ ఒక ఆడపిశాచి తల వెనక్కు తిప్పి, నాలుక మూరెడు పొడుగున చాచింది.

"భేష్! భేష్!" అని మిగిలిన రెండు పిశాచాలూ దాన్ని మెచ్చుకుని, "మనం ముగ్గరమూ జట్టుగా ఉందాం," అన్నాయి. ఆడపిశాచి మిగిలిన రెండు పిశాచాలను గురించీ తెలుసుకుని, వాటితో జట్టు కలియటానికి ఒప్పుకున్నది.

అయితే ఒక సమస్య వచ్చింది. జట్టుకు నాయకత్వం ఎవరు తీసుకోవాలి? దీన్ని గురించి చాలాసేపు చర్చించిన మీదట పిశాచాలు ఒక నిర్ణయానికి వచ్చాయి. అదేమిటంటే, ముగ్గురూ మూడు రోజుల పాటు తలా ఒక గొప్ప పని చేయాలి. ముగ్గురు చేసిన పనులలో ఎవరి పని ఎక్కువ గొప్పదైతే వారికే నాయకత్వం!

ముసలిపిశాచి మిగిలిన వాటితో, "రేపు అర్ధరాత్రి తిరిగి ఇక్కడే కలుద్దాం.

ఎం. కామేశ్వరరావు

ఈ లోపల నేను ఏదైనా గొప్ప పని చేసి మీకు చెబుతాను,'' అన్నది.

తరవాత మూడు పిశాచాలూ వేటి దారిన అవి పోయాయి.

మర్నాడు రాత్రి రెండో ఝాము నడుస్తున్నది. ముసలి పిశాచం శ్మశాన ప్రాంతంలోనే తచ్చాడుతున్నది. అది ఇంకా ఏ గొప్ప పనీ చెయ్యలేదు. ఆ పిశాచిక ఒక చెట్టు కింద ముడుచుకుని పడుకుని ఉన్న ఒక యువకుడు కనపడ్డాడు. వాడు అనాకారిగా ఉన్నాడు, చలికి వణుకుతున్నాడు. వాడికి కప్పుకునేటందుకు ఏమీ లేదు.

ఆ కుర్రవాడి పేరు సూరన్న. వాడి తల్లిదండ్రులు చిన్నతనంలోనే పోయారు. వాడికొక మేనమామ ఉన్నాడు గాని, అలాటి అనాకారి వాణ్ణి సాకితే పిల్లనిచ్చి పెళ్ళి చెయ్యవలసి వస్తుందని, వాణ్ణి ఆయన చేరదీయలేదు. వాడు రాత్రి పూట ఏ చెట్టు కిందనో పడుకుని నిద్రపోతూ ఉంటాడు.

సూరన్నను చూడగానే ముసలి పిశాచిక ఒక మెరుపులాటి ఆలోచన వచ్చింది. అది వాడి మీద ఒక పాతగొంగళి తెచ్చి కప్పింది. అది క్షణాలమీద వేడి ఎక్కింది. అయితే సూరన్నది మొద్దు నిద్ర కావటం చేత వాడు లేవలేదు. అలా వేడి ఎక్కిన గొంగళి ఒక్కసారిగా భగ్గున మండి, మాయమైపోయింది. అప్పటికీ సూరన్న నిద్రలేవలేదు. కాని





వాడి అనాకారి రూపం పూర్తిగా మారి పోయింది. వాడిప్పుడు చాలా అందంగా ఉన్నాడు.

ఆ మార్పు చూసిన ముసలి పిశాచం తృప్తిపడి, అర్ధరాత్రి అయేసరికల్లా మిగి లిన రెండు పిశాచాలనూ కలుసుకుని, తాను చేసిన గొప్ప పని వాటికి చెప్పింది. మిగతా పిశాచాలు ముసలి పిశాచిని మెచ్చుకున్నాయి.

ఈసారి కుర్రపిశాచి తాను కూడా ఒక గొప్పపని చేస్తానన్నది.

తెల్లవారింది. సూరన్న దారి వెంట నడిచి వెళుతుండగా, వాడి మేనమామ వాడిలో కలిగిన అందమైన మార్పు చూసి ఆశ్చర్యపడి, తిన్నగా వాణ్ణి తన ఇంటికి తీసుకుపోయాడు.

కుర్రపిశాచి మేనమామ భార్య చేత, "ఈ దరిద్రుణ్ణి వెంట బెట్టుకొచ్చావెం దుకూ?" అని అడిగించింది.

"కూతుర్ని ఇచ్చి పెళ్ళిచెయ్యటానికి. కుర్రవా డిప్పుడు చక్కగా ఉన్నాడు," అన్నాడు మేనమామ, సూరన్నను లోప లికి తీసుకుపోతూ.

ఆయన భార్య మెటికలు విరిచి, "ఈ శనిగాడికి ఇంత విషం పెట్టి వదిలించు కుంటాను," అన్నది, కుర్రపిశాచి ప్రేరణతో.

అయితే ఈ మాటలు ఆమె కూతురు విన్నది. ఆ పిల్ల రహస్యంగా సూరన్నను కలుసుకుని, "నువు పారిపో. అమ్మ నిన్ను చంపాలనుకుంటున్నది," అని కంగారుగా అన్నది.

సూరన్న ప్రాణభయం కొద్దీ పారి పోయాడు. వాడు చీకటిపడే సరికి అడవి మధ్య ఒక అందమైన భవనం వద్దకు వచ్చాడు. అందులో నుంచి అనేకమంది పరిచారికలు వచ్చి, వాణ్ణి లోపలికి తీసుకుపోయి, పన్నీటితో స్నానం చేయించి, పట్టుబట్టలు కట్టబెట్టి, బ్రహ్మాండమైన విందుభోజనం పెట్టి, పట్టుపరుపుల మీద పడుకోబెట్టారు.

కుర్రపిశాచి ఈ ఏర్పాట్లన్నీ పూర్తి చేసి, అర్ధరాత్రి అయేసరికి మిగిలిన రెండు పిశాచాలనూ కలుసుకుని తాను చేసిన గొప్ప పని చెప్పింది. అవి కుర్ర పిశాచిని మెచ్చుకున్నాయి.

ఈసారి వంతు ఆడపిశాచిది. అది తిన్నగా రాజభవనానికి వెళ్ళింది. అక్కడ రాజుగారు తన కుమార్తెతో సహా ఫల. హారం సేవిస్తూ, కులాసాగా కబుర్లు చెప్పు తున్నాడు.

అకస్మాత్తుగా రాజకుమార్తె కళ్ళెర్ర చేసి, "నా పెళ్ళి ఎప్పుడు చేస్తావు?" అని తండ్రిని అడిగింది.

రాజు తెల్లబోయాడు. అంతకు క్రితం రోజే ఆయన తన కుమార్తె దగ్గిర పెళ్ళి మాట తెస్తే, మరొక సంవత్సరందాకా ఆ సంగతి తలపెట్టవద్దని ఆమె అన్నది.

ఆ మనిషే ఇప్పుడు తండ్రిని చూసి, "అలా వెర్రిమొహం వేశావేమిటి? అడవి మధ్య అందమైన భవనంలో నా కోసం సూరన్న ఎదురుచూస్తున్నాడు. అతన్ని ఇక్కడికి తెచ్చి నాతో పెళ్ళి చెయ్యక పోతే నేనే అక్కడికి వెళ్ళిపోతాను," అంటూ శోకాలుపెట్టింది.

ఏంచెయ్యటానికీ పాలుపోక, రాజు కొంత పరివారాన్ని తీసుకుని బయలు దేరాడు. నిజంగానే అడవి మధ్య అందమైన భవనం ఉన్నది. అందులో మరింత అందంగా ఉన్న సూరన్న కనిపించాడు. రాజు వాణ్ణి చూసి ముచ్చటపడి, తీసుకు



పోయి తన కూతురునిచ్చి అప్పటికప్పుడే పెళ్ళి చేశాడు. ఆడపిశాచి కూడా ఒక గొప్ప పని సాధించింది.

ఆ రాత్రి మూడు పిశాచాలూ కలుసుకున్నప్పుడు ఆడపిశాచి, "మీ కన్న నేనే గొప్ప పని చేశాను. మన జట్టుకు నేనే పెద్దను," అన్నది.

"చాల్లే, సూరన్న ఇల్లూ, ఐశ్వర్యమూ చూసి రాజుగారు పిల్లనిచ్చారు. నేను చేసిందే గొప్ప పని," అన్నది కుర్ర పిశాచి.

"మీ రిద్దరూ నోరు ముయ్యండి. ఆ సూరన్నను అందగాడుగా చేసింది నేను. పైగా వయసులో పెద్దను. నేనే జట్టుకు నాయకుడుగా ఉండాలి," అన్నది ముసలిపిశాచి.

మూడు పిశాచాలూ ఇలా చాలాసేపు తగూలాడుకుని చివరకు సూరన్ననే అడుగుదామని బయలుదేరాయి.

సూరన్న రాజభవనంలో పట్టుపరుపుల మీద సుఖనిద్రలో ఉన్నాడు. పిశాచాలు వెళ్ళి, వాణ్ణి నిద్రలేపి, తమను తాము పరిచయం చేసుకున్నాయి.

"నిన్ను అందగాడుగా చేసింది నేను," అన్నది ముసలిపిశాచి.

"నిన్ను ఐశ్వర్యవంతుణ్ణి చేసింది నేను," అన్నది కుర్రపిశాచి.

"నిన్ను రాజుగారి అల్లుడు చేసింది నేను," అన్నది ఆడపిశాచి.

"మాలో ఎవరు చేసిన పని గొప్పది?" అని మూడు పిశాలాలూ అడిగాయి.

సూరన్న కోపం పట్టలేక ఆ పిశాచాలను తన్నినంత పని చేసి, "మీ వెర్రి మొర్రి తగువు తీర్చటానికా నా నిద్ర చెడగొట్టారు? వెళ్ళండి, వెళ్ళండి! ఎన్నడూ ఇలాటి పిచ్చి పనులు చెయ్యకండి," అన్నాడు.

పిశాచాలు చిన్న బుచ్చుకుని, "మనం జట్టుగా ఉంటే ఇలాటి పిచ్చి పనులు ఇంకా ఎన్ని చేస్తామో! ఎవరి దారిన వారు ఉండటమే మంచిది." అనుకుని విడివిడిగా వెళ్ళిపోయాయి.





# గయ్యాళి భార్య

బెంగాలులోని ఒక గ్రామంలో లలితుడు అనే ఒక బ్రాహ్మణ విద్వాంసుడు ఉండేవాడు. ఆయనకు అనేక గ్రామాలలో శిష్యులు ఉండేవారు. లలితుడు అప్పుడప్పుడూ రెండు, మూడు రోజులపాటు సంచారం బయలుదేరి, తన శిష్యుల వద్ద దక్షిణలు వసూలు చేసుకుని వచ్చి, జీవయాత్ర గడిపేవాడు.

లలితుడి భార్య సురభి పట్టి గయ్యాళి. ఆమె అస్తమానమూ తన భర్తను తిట్టిపోస్తూ, అతనికి క్షణమైనా మనశ్శాంతి లేకుండా చేసేది. ఆమె ఇరుగుపొరుగు వాళ్లను కూడా విడిచిపెట్టేది కాదు; చీమ తలకాయంత నెపం దొరికితే చాలు, వాళ్లతో రోజుల కొద్దీ తగాదా పెట్టుకునేది.

ఈ గయ్యాళిభార్య మూలంగా లలితుడికి ఇల్లు అంటే రోతగా ఉండేది. అతను శిష్యుల వద్దకు సంచారం వెళ్లినప్పుడే కాస్త సుఖంగా ఉండేవాడు.

సురభితో వచ్చిన చిక్కేమంటే, ఆమెకు తన భర్త అంటే మమకారం లేకపోలేదు. అతను ఊళ్ళో లేనప్పుడు, లేడని చాలా బాధపడేది; అతన్ని ఎన్నడూ ఏమీ అనననని ఒట్లుపెట్టుకునేది. కాని మళ్ళీ అతని ముఖం కనిపించేసరికి ఆ ఒట్లన్నీ గాలికి పోయేవి. అతన్ని కాస్త విశ్రాంతి అయినా తీసుకోనియ్యకుండా అతని మీద విరుచుకుపడేది. ఆమెకు ఒక కూతురూ, ఒక కొడుకూ ఉండేవారు. తండ్రి పైన జాలిపడి వాళ్లు, తమ తల్లిని సౌమ్యంగా ఉండమని బతిమాలేవాళ్ళు. కాని ఆమెకు వాళ్ళ మాటలు తలకెక్కేవి కావు.

ఆరంభంలో లలితుడు తన భార్యను మంచిగా ఉంచటానికి ఏవేవో బహు

ఏ. సి. సర్కార్, ఇంద్రజాలికుడు



మతులు తెచ్చి ఇచ్చేవాడు. కాని వాటి వల్ల కొంచెం కూడా ప్రయోజనం లేక పోయింది. ఆమె నోరు మహా చెడ్డది. ఆమె స్వభావాన్ని మార్చటం లలితుడికి సాధ్యంకాలేదు.

ఒకనాటి మధ్యాన్నం లలితుడు సంచారం నుంచి ఇంటికి తిరిగి వచ్చాడు. ఆ రోజే ఎవరో శిష్యుడు అతనికి ఒక పెద్ద సొరకాయ తెచ్చి ఇచ్చాడు. అప్పటికి సురభి తాను తిని, పిల్లలకు పెట్టి, పడుకున్నది.

లలితుడు చాలా ఆప్యాయంగా, "ఇదుగో, చూడు, నీకోసం ఏం తెచ్చానో!" అన్నాడు.

"నాకోసం నువ్వేం తెస్తావులే? అవతల పారెయ్యి. నేను నిద్రపోవాలి," అని ఒత్తిగిలి పడుకున్నది సురభి.

లలితుడు సొరకాయను ఆమెకు దగ్గిరగా తెచ్చి, "చూడు ఎంత పెద్దదో!" అన్నాడు.

"దరిద్రగొట్టు మొహమా! నువు ఎన్నడన్నా మంచి వస్తువుల మొహం చూసి ఉంటేగద!" అంటూ సురభి చివాలున లేచి, కాయను భర్త చేతిలో నుంచి లాక్కుని, వీధిలోవున్న పెంటకుప్ప మీద పారేసింది.

దాంతో లలితుడికి జీవితంమీద పూర్తిగా విరక్తికలిగింది. అతను ఆత్మహత్య చేసుకోవటానికి నిశ్చయించుకుని, గంగానదికి పరిగెత్తాడు. నడుముకు పెద్ద రాయి కట్టుకుని లలితుడు గంగలోకి ఉరకబోతూ ఉండగా అతని మిత్రుడు సోమనాధుడు దూరం నుంచి చూసి, అతన్ని ఆగమన్నాడు.

"ఏమిటీ అఘాయిత్యం, లలితా?" అని అతను అడిగాడు.

"నాకు బతకాలని లేదు. నా భార్యను సహించినంత కాలం సహించాను. నన్ను ఇంక చావనీ," అన్నాడు లలితుడు.

సోమనాథుడు లలితుణ్ణి మంచిమాటలతో ఓదార్చి, "నాకు ఇంద్రజాలం

వచ్చునని నీకు తెలుసుగద. నీ కష్టాలు గట్టెక్కించే ఉపాయం నన్ను చెయ్యనీ. నా వల్ల కాకపోతే, ఆ తరవాత నీ యిష్టం వచ్చినట్టు చెయ్యి," అన్నాడు.

"చెయ్యగలిగినదంతా నేను చేసి చూశాను. ఏమీ లాభం లేదు," అన్నాడు లలితుడు.

"నిరాశ పనికిరాదు. నేను నెగ్గి తీరుతాను," అన్నాడు సోమనాధుడు.

మిత్రులిద్దరూ కలిసి భోజనం చేసి, సోమనాధుడి పథకం గురించి మాట్లాడుకున్నారు. ఆ పథకం విన్న మీదట లలితుడిలో ఆశ తల ఎత్తింది.

ఆ రోజు సూర్యాస్తమయమై, చీకటి పడింది. పెద్ద జుట్టూ, గడ్డమూ గల ఒక ముని లలితుడి ఇంట ప్రవేశించాడు. ఆ సమయంలో లలితుడి భార్య సురభి దేవుడి మందిరంలో దీపారాధన చేస్తూ, కొత్త మనిషిని చూసి ఉలికిపడింది.

"పాపిష్ఠిదానా, ఇంకా పుణ్యస్త్రీ లాగే ఉన్నావా? తీసెయ్యి! నువు విధవరాలివి!" అన్నాడు ముని గంభీరంగా.

"గడ్డపు వెధవా, పో అవతలికి! నేను విధవరాలినని ఎవడు చెప్పాడు నీకు? నా భర్త బతికే ఉన్నాడు," అన్నది సురభి.

"లేదు, ప్రాణాలతో లేదు. మహాకాళి ముందు పీక కోసుకుని తనను తాను బలి ఇచ్చుకున్నాడు. కావాలంటే, నా వెంట వచ్చి చూడు," అన్నాడు ముని.





''ఈ మాట నీ కెవరు చెప్పారు?'' అని సురభి అడిగింది.

''నేనే చూశాను,'' అన్నాడు ముని.

అనుమానిస్తూ సురభి ఆ ముని వెంట కాళికాలయానికి వెళ్ళింది. ఆలయం తలుపులు మూసి ఉన్నాయి. కాని కిటికీ కుండా భయంకరమైన దృశ్యం సురభి కళ్ళ పడింది. రక్తపు మడుగులో లలితుడు పడి ఉన్నాడు. అతని కంఠంలో కత్తి ఇరుక్కుని ఉన్నది. చచ్చి పోయిన కారణంగా లలితుడి శరీరం నీలంగా అయిపోయింది.

''అయ్యో, ఇంత పని చేశావా?'' అంటూ సురభి ఏడవసాగింది. ఆమె గుండె అవిసి పోయింది. ఆమె మతి పోయిన దానిలాగా ఏడుస్తూ, తల గోడ కేసి కొట్టుకోసాగింది.

గుడిపూజారి వచ్చి, ''అమ్మా, ఇప్పుడు ఎంత ఏడ్చి ఏం లాభం? బతికి ఉన్న న్నాళ్ళూ అతన్ని రాచి రంపాన పెట్టావు. పోట్లాడటం తప్ప నువు అతనికి ఏం చేశావు? నీ పోరు పడలేక అతను ప్రాణం తీసేసుకున్నాడు,'' అన్నాడు.

''అవును, నా మూలానే పోయాడు. నేను పాపిష్ఠిదాన్ని, బతికి ఉండరాదు. చచ్చి ప్రాయశ్చిత్తం చేసుకుంటాను,'' అంటూ సురభి తన నుదురు గోడకేసి మరింత గట్టిగా కొట్టుకున్నది.

ముని ముందరికి వచ్చి, ఆమెను వారించి, ''అమ్మా, నీవు నీ భర్తకోసం ప్రాణం ఇచ్చేటంత అభిమానం గలదాని వైతే, అతన్ని పోరు పెట్టకుండానే ఉండ వలిసింది. అతను నీతో కాస్తంత సుఖపడి ఎరగడు గద!'' అన్నాడు.

''క్షమించండి, బాబూ. నాకు సుఖ పెట్టటం చేతకాలేదు. అందుకే ఆయనతో పాటు చచ్చిపోతాను,'' అన్నది సురభి.

ముని తన గుడ్డ సంచీ లోపలి నుంచి ఒక విచిత్రమైన వేరు పైకి తీసి, ''చూడమ్మా, ఇది మృతసంజీవిని. దీని సహాయంతో నేను నీ భర్తకు తిరిగి ప్రాణం

పొయ్యగలను. కాని ఒక్క షరతు: నువు అతన్ని ఎన్నడూ మాటలనరాదు; అతనితో గాని, ఇతరులతో గాని పోట్లాటకు దిగరాదు. అలా అని మహాకాళి మీద ప్రమాణం చేస్తావా?'' అన్నాడు.

సురభి అలాగే ప్రమాణం చేసింది.

ముని తన పైబట్ట తీసి లలితుడి మీద తల నుంచి కాళ్ళదాకా కప్పాడు; దాని కింద తన చెయ్యి పోనిచ్చి, వేరుతో ఏదో చేశాడు. కొంచెం సేపు అయాక ఆయన నెత్తురు ఓడుతున్న కత్తిని పైకి తీసి, నింపాదిగా బట్టను శవం మీది నుంచి తొలగించాడు.

లలితుడింకా నిర్జీవంగానే ఉన్నాడు. ముని అతని కంఠం మీద వేరుతో చాలా సార్లు రాచాడు. లలితుడి శరీరంలో కొంచెం కదలిక ఆరంభమయింది. మరి కొంతసేపటికి, లలితుడు నిద్ర నుంచి లేచిన వాడిలాగా, బలహీనంగా లేచి కూర్చున్నాడు.

ఆలయం తలుపు తెరిచారు. సురభి లోపలికి వెళ్ళి, తన భర్త కాళ్ళ మీద పడి, "క్షమించండి! క్షమించండి! మిమ్మల్ని ఎన్నటికీ పల్లెత్తుమాట అనను. క్షమించానని చెప్పండి!'' అంటూ ఏడ్చింది.

లలితుడు సురభి కేసి చూసి చిరునవ్వు నవ్వాడు. ఆలయం మనుషులను ఇద్దరిని తోడుతీసుకుని, సురభి తన భర్తను ఇంటికి తీసుకుపోయింది.



అందరూ వెళ్ళిపోయాక ముని తన పెట్టుడు జుట్టూ, గడ్డమూ తీసేసి, సోమ నాథుడుగా మారిపోయాడు.

''సురభి గయ్యాళితనం వదిలించాం! మన ఎత్తు పారింది గదా, శాస్త్రిగారూ?'' అన్నాడతను పూజారితో.

''పూర్తిగా పారింది. ఇక ఆ ఇల్లాలు తన మొగుడితో ఎన్నటికీ పోట్లాడదు. కాని ఈ గొంతు కోత రహస్యం ఏమిటి?'' అని పూజారి అడిగాడు.

''పెద్ద రహస్యం ఏమీ లేదు. నేను ఇంద్రజాల ప్రదర్శనలలో తరచుగా చేసేదే. ఈ కత్తులు చూడండి. ఇది మామూలు కత్తి. ఈ రెండోది ఇంద్రజాలానికి ఉపయోగించేది. దీనిలో గుండ్రని భాగం కత్తిరించి ఉన్నది. ఈ భాగం మనిషి గొంతుకు సరిగా అని ఉంటుంది. దీన్ని లలితుడి మెడకు అనించి పెట్టాను; రంగుతో మాయ రక్తం తయారు చేసి చల్లాను; లలితుడి ఒంటికి కొద్దిగా నీలం రంగు పులిమాను; మామూలు కత్తి లలితుడి శరీరం కింద దాచాను. గుడిదీపాల కొద్దిపాటి వెలుగులో హత్య జరిగినట్టు భ్రమ కలిగించటం మరింత తేలిక. లలితుడి మీద గుడ్డ కప్పినప్పుడు, అతని శరీరం కింద ఉన్న మామూలు కత్తి బయటపడేసి, గుడ్డతోపాటు దొంగ కత్తిని తీసేశాను. లలితుడు కూడా తన పాత్ర తాను చక్కగా నటించాడు,'' అన్నాడు సోమనాథుడు.

''బాగుంది. కాని దేవాలయంలో ఇలాటి పని జరిగిందే అని నా విచారం,'' అన్నాడు పూజారి.

''అదేమీ లేదు. ఒక నిండు ప్రాణాన్ని కాపాడటమే గాక, అతని జీవితం సుఖంగా ఉండేటట్టు చేశాం. కాళీ మాత ఎంతో సంతోషిస్తుంది,'' అన్నాడు సోమనాథుడు.

ఏమైనా సురభి మళ్ళీ ఎన్నడూ లలితుడితో పోట్లాడలేదు. తన ఇంటి చుట్టుపక్కలవున్న ఎవరితోనూ ఆమె కయ్యానికి కాలుదువ్వలేదు.





# కష్టానికే ఫలితం

పుష్పవంత మనే నగరానికి పర్ణకేతుడు యువరాజు. అతనికి తరచుగా ఒక కల రావటం జరిగింది. ఆ కలలో అతనికి ఒక నాగకన్య కనిపించి, "నా కోసం మీ నగరపు సముద్ర తీరాన వెతుకు," అని చెప్పి, చిరునవ్వు నవ్వి, అదృశ్య మయేది.

ఇలా మళ్ళీ మళ్ళీ కలల్లో కనిపించ టంతో రాజకుమారుడికి ఆ నాగకన్యనే పెళ్ళాడాలన్న కోరిక గాఢంగా కలిగింది. అందుచేత అతను ఒకటికి రెండుసార్లు తమ నగరానికి సమీపంలో గల సముద్ర తీరం వెంబడి అటునుంచి ఇటు తిరిగి వచ్చాడు. కాని నాగకన్య అతనికి కని పించలేదు.

అందుచేత అతను తన అంతరంగికు లకు తన కల గురించి చెప్పి, సముద్ర తీరాన నాగకన్యను వెతికి తీసుకు రమ్మని చెప్పాడు. వాళ్ళు సముద్ర తీరం వెంబడి ఎంతో శ్రమపడి కాపలా కాసి, నాగకన్యక జాడ తెలుసుకోలేక పోయారు.

అప్పుడు పర్ణకేతుడు ఒక చాటింపు వేయిస్తూ, సముద్ర తీరాన వెతికి నాగ కన్యకను తెచ్చిన వారికి వెయ్యి బంగారు కాసులు ఇస్తానన్నాడు. ధనాశతో ఎన్నో వేల మంది సముద్రం ఒడ్డు వెంబడి తెగ తిరిగారు. కొందరు సాధ్యమైనంత వరకు సముద్రంలోకి ఈదుకుంటూ కూడా వెళ్ళారు. కాని ఎవరూ నాగకన్యను చూడలేదు.

రాజుగారి మంత్రులు రాజకుమారు డితో, "నీ కెందుకీ భ్రమ? ఆ కలకూడా అన్ని కలల లాగే ఒక భ్రమ. ఆ నాగ కన్య నిజంకాదు. అనవసరంగా శ్రమ పడటం దేనికి," అన్నారు. ఆలోచించి చూడగా రాజకుమారుడికి కూడా

జి. రుక్మిణీదేవి

వాళ్ళు చెప్పేది నిజమే నేమో నని పించింది.

నాగకన్య కోసం వెతకటానికి వచ్చిన వారిలో సంగముడు అనే కటిక పేద యువకుడు ఉన్నాడు. మిగిలిన వాళ్ళంతా తమ ప్రయత్నం మానుకున్నా సంగముడు తన ప్రయత్నం మానలేదు. నాగకన్య ఎవరికీ కనపడక పోవటానికి కారణం వాళ్ళంతా ఆమె కోసం చూశారు గాని ఆమె కోసం వెతకలేదు. వెతికితే గాని ఆమె కనిపించదు. అంతేకాదు, ఆమె ఏ రూపంలో ఉండేదీ ఎవరికీ తెలీదు. సంగముడు బంగారుకాసుల కోసం నాగకన్యను దీక్షతో వెతక నిశ్చయించాడు. అతను సముద్ర తీరానే సంచారం చేస్తూ, ఇసుకలో కనిపించే ప్రతి ఎండ్రకాయనూ, ఇతర పురుగులనూ చూసి, "నువు నాగకన్యవు కావుగద?" అని అడుగుతూ వచ్చాడు. ఇసుకలో ఏదైనా వస్తువు కనిపిస్తే, అది ఒక వేళ నాగకన్య ఏమోనని పైకి తీసి జాగ్రత్తగా చూసేవాడు.

సంగముడు ఇలా దీక్షగా సముద్ర తీరాన వెతుకుతూ ఉండగా, అతనికి ఇసుకలో సగం కూరుకుపోయి మెరుస్తూ ఏదో కనబడింది. సంగముడు దాన్ని పైకి తీశాడు. అది ఒక ఉంగరం. బాగా మట్టి పట్టి ఉన్నది. దాన్ని కడుగుదామని వాడు నీటి కేసి వెళ్ళాడు. కాని వాడికి నీరు అందక, వెనక్కు పోయింది. వాడు



మరి రెండడుగులు ముందుకు వేశాడు. సముద్రపు నీరు రెండడుగులు వెనక్కు పోయింది.

సంగముడు అమిత ఆశ్చర్యపడుతూ అలాగే ముందుకు వెళ్ళాడు. నీరు వాడికి దారి ఇస్తూ ఎంతో దూరం తీసుకు పోయింది.

అకస్మాత్తుగా వాడికి, "వచ్చాడు! వచ్చాడు! మణిప్రవాళీ, నీ భర్త వచ్చాడు!" అన్న కేకలు వినిపించాయి. వాడు తలఎత్తి చూసి తాను ఒక తోట మధ్య ఉన్నట్టు తెలుసుకున్నాడు. ఆ తోటలో ఒక మందిరం ఉన్నది. తోటలోని చెట్ల నుంచీ, మందిరం నుంచీ వెన్నెల లాటి మృదువైన కాంతి వస్తున్నది. మందిరం మణులతో నిర్మించినట్టుగా ఉన్నది.

మందిరం నుంచి కొందరు నాగకన్యలు వచ్చి, "రండి, రండి!" అని సంగముణ్ణి ఆహ్వానించారు.

అతను లోపలికి వెళ్ళేసరికి మణిప్రవాళి అనే అద్భుత సుందరి ఎదురు వచ్చి, అతనికి స్వాగతం చెప్పి, ఒక ఆసనంలో కూర్చో బెట్టింది.

"నా కోసం చాలా శ్రమపడ్డావు. ముందు మంచి దుస్తులు ధరించి, భోజనం చెయ్యి." అన్న దామె.

"నేను శ్రమపడ్డ మాట నిజమేగానీ, నీ కోసం కాదు, మా యువరాజు ఇస్తా నన్న బహుమానం కోసం. నువు



నా వెంట వచ్చినట్టయితే నిన్ను మా యువ రాజుకు అప్పగించి, ఆయన యిచ్చే బహుమానం పుచ్చుకుంటాను,'' అన్నాడు సంగముడు.

'' అది సాధ్యం కాదు,'' అంటూ మణిప్రవాళి జరిగిన సంగతి ఇలా చెప్పింది :

'' నేనూ నా చెలికత్తెలూ ఒక వెన్నెల రాత్రి సముద్ర తీరాన ఆటలాడ వెళ్ళాం. అప్పుడు నా ఉంగరం ఎక్కడో పడి పోయింది. కన్య ధరించిన ఉంగరం ఏ పురుషుడి చేతికి వస్తే ఆ పురుషుడే ఆమె భర్త అని మా నియమం. మా కన్యలు తాము పెళ్లాడ గోరిన వాడి చేతిలో తమ ఉంగరం పెట్టి స్వయంవరం చేస్తారు. నా ఉంగరం ఏ పురుషుడికి దొరికితే ఆ పురుషుడు మా నాగలోకానికి స్వేచ్ఛగా రాగల ఏర్పాటు మా తండ్రి చేశాడు. ఆ ఉంగరం సంపాదించే వాడు రాజుకొడుకైతే ఘనంగా ఉంటుం దను కుని మీ రాజకుమారుడికి నేను కలలో కనిపించేటట్టు చేశాడు. ఈ విషయంలో మా తండ్రి పొరపడ్డాడు. నా ఉంగరం వెతకటం కష్టంతో కూడిన పని. గొప్ప వాళ్ళు ఇంద్రపదవి వస్తుందన్నా దాని కోసం శ్రమపడలేరు. నీ వంటి సహన శక్తి, దీక్ష కలవాడే అలా శ్రమపడగలడు. నువు శ్రమించి నన్ను భార్యగా సంపా దించు కున్నావు. నీకు బంగారం కావా లంటే, ఆ యువరాజు ఇచ్చిన దాని కన్న లక్ష రెట్లు నేనే ఇయ్యగలను. అది అలా ఉండగా నేను నీ వెంట వచ్చి, మీ భూలో కంలో నివసించటం సాధ్యంకాదు. నువే ఇక్కడ ఉండిపో.''

అందుకు సంగముడు సంతోషంగా ఒప్పుకుని, మణిప్రవాళిని పెళ్ళాడి, నాగ లోకం లోనే ఉండిపోయాడు.

పుష్పదంతంలో పర్ణకేతుడికి నాగ కన్య మళ్ళీ కలలో కనిపించలేదు. అతను త్వరలోనే ఆమెను మరిచిపోయి, వేరొక రాజకన్యను పెళ్ళాడి. అతను కూడా సుఖంగానే ఉన్నాడు.






పూర్వం సుపర్వగిరి మీద కేసరి అనే గొప్ప వానరుడు ఉండేవాడు. ఆ పర్వతం మీద అరవైవేలమంది వానరులు ఉండే వారు. కేసరి వారికి నాయకుడు.

ఒకప్పుడు ప్రభాసతీర్థంలో ఉండే మునులను శంఖమూ, శబలమూ అనే రెండు ఏనుగులు బాధిస్తూ ఉంటే, కేసరి ఆ రెండు ఏనుగులనూ చంపేశాడు. అందుచేత అతనికి కేసరి (సింహం) అనే పేరు వచ్చింది.

కేసరి మహా బలవంతుడూ, భాగ్యవంతుడూ అయి ఉండి కూడా, బ్రహ్మచర్యం అవలంబించి, మహా ఘోరమైన తపస్సు చేసి, అంతులేని శక్తులు సంపాదించాడు.

ఆ కాలంలో శంబసాధనుడు అనే రాక్షసుడు తపస్సు చేసి బ్రహ్మను మెప్పించి, మూడు లోకాలనూ జయించే టట్టు వరం పొంది, మునులనూ, సిద్ధులనూ, దేవతలనూ అమితంగా హింసించ నారంభించాడు.

దేవతలందరూ కలిసి బ్రహ్మదేవుడి వద్దకు వెళ్ళి, శంబసాధనుడు పెట్టే బాధలు భరించలేమని మొరపెట్టుకున్నారు. బ్రహ్మ వారిని కేసరి వద్దకు పంపాడు. దేవతలు కేసరి వద్దకు వెళ్ళి, అతన్ని ఆశీర్వదించి, శంబసాధనుడు పెట్టే బాధలన్నీ చెప్పుకుని, "బాబూ, ఆ దుర్మార్గుణ్ణుంచి నువే మమ్మల్ని కాపాడాలి!" అన్నారు.

**1. హనుమంతుడి జననం**



ఇదే సమయంలో నారదుడు శంబసాధనుడి వద్దకు వెళ్ళి, "శుభమస్తు," అన్నాడు.

శంబసాధనుడు నారదుడికి నమస్కారంచేసి, "ఎక్కడినుంచి వస్తున్నారు? ఏమిటి విశేషాలు?" అని అడిగాడు.

"హేమకూటం నుంచి వస్తున్నాను. అక్కడ ఇంద్రుడు మొదలైన దేవతలందరూ చేరి, నిన్ను చంపమని ఒక వానరుణ్ణి ప్రార్థిస్తూ ఉన్నారు. ఈ మాట నీతో చెప్పిపోదామనే వచ్చాను," అన్నాడు నారదుడు.

ఈ మాట వినగానే శంబసాధనుడు ఆజ్యం పోసిన అగ్నిలాగా మండిపడి, "ఓహో! పాపం గదా అని ప్రాణాలతో వదిలిపెడితే, ఇదా దేవతలు చేస్తున్న ఆలోచన? నన్ను కోతి చేత ఎలా చంపిస్తారో నేనూ చూస్తాను! ఇంత కాలమూ చచ్చినట్టు పడి ఉన్న వాళ్ళు నన్ను చంపటానికి చూస్తున్నారా? నా భుజబలం ఏమిటో యీ దేవతలందరికీ చూపిస్తాను," అన్నాడు.

ఆ రాక్షసుడు ప్రళయకాలరుద్రుడిలాగా చేతిలో మెరిసే కత్తి పట్టుకుని కేసరి ఉన్న చోటికి అతి వేగంగా వచ్చి పడ్డాడు. అతని పెడబొబ్బలు విని కేసరి వద్ద ఉన్న దేవతలకు గుండెలు అవిసిపోయాయి. వాళ్ళు కొండగుహల్లోనూ, కేసరి చాటునా దాక్కునే ప్రయత్నాలు చేశారు.

"ఎక్కడికి పోతారు? మిమ్మల్నందరినీ ఒక్క దెబ్బతో చంపేస్తాను," అంటూ శంబసాధనుడు దేవతలను తరుముతూ ఉంటే, కేసరి అతనికి అడ్డం వెళ్ళి, "ఒరే, దుర్మార్గుడా! నా చేత చావటానికే వచ్చావు. యుద్ధం చెయ్యి," అన్నాడు.

"ఛీ, ఛీ! కోతితో యుద్ధం చెయ్యటమా? నాతో యుద్ధం చెయ్యటానికి శివుడే భయపడతాడు గద! ఒక్క క్షణంలో నీ సంగతి తేల్చేస్తాను," అంటూ శంబసాధనుడు కత్తి ఎత్తాడు.



సిద్ధపడ్డాడు. కాని కేసరి పిడికిలితో ఒక్క పోటు పొడిచే సరికి, ఆ రాకసుడు నెత్తురు కక్కుకుని చచ్చాడు. రాకసుడు చావటంతో దేవతల కష్టాలు తీరి పోయాయి.

దేవతలు కేసరితో, "ఇంకా ఎంత కాలం బ్రహ్మచారిగా ఉంటావు? ఇంక పెళ్ళి చేసుకుని గృహస్థువు అయిపో!" అని కేసరిని హెచ్చరించి వెళ్ళిపోయారు. కేసరి కూడా తనకు అనుకూలంగా ఉండే కన్య కోసం చూడసాగాడు.

బ్రహ్మదేవుడు సర్వాంగ సౌందర్యం గలిగిన అహల్య అనే కన్యను సృష్టించి గౌతముడు అనే మునికి భార్యగా ఇచ్చాడు. కొంతకాలానికి వారిద్దరికీ అంజన అనే కూతురు పుట్టింది.

అంజన పూర్వజన్మలో ఒక విద్యాధరుడి కూతురు. ఆమె గొప్ప గాయకురాలు. అందుచేత ఆమెకు సుకంఠి అనే పేరు వచ్చింది. ఆమె ఒకసారి తన చెలికత్తెలతో హిమాలయానికి వెళ్ళి, అక్కడ ఒక సరోవరంలో జలకాలాడి, ఒక చెట్టు కింద ఉండగా, అగ్నిహోత్రుడు అటు పోతూ కనిపించాడు. అతన్ని చూసి సుకంఠి నవ్వింది. అగ్నికి కోపం వచ్చి, వచ్చే జన్మలో వానరుణ్ణి కనమని శపించాడు.

ఇంతలో కేసరి పెద్ద రాయి ఎత్తి, రాకసుడి రొమ్ము అదిరేటట్టు కొట్టాడు. రాకసుడు కేసరి మీద ఒక గద విసిరితే, అది కేసరి రొమ్ముకు తగిలి పిండి అయి పోయిరిది. కాని కేసరి చలించలేదు. శంబసాధనుడు ఒక శూలాన్ని విసిరితే, కేసరి దాన్ని ఒడిసి పట్టుకుని, తన మోకాలికి పెట్టి విరిచేశాడు. అప్పుడు రాకసుడు కేసరిని కత్తితో కొట్టటానికి ముందుకు వచ్చాడు. కేసరి తన తోకతో రాకసుడి చేతి మీద కొట్టేసరికి కత్తి జారి కింద పడింది.

కిందపడిన కత్తి తీసుకోవటానికి శంబసాధనుడు ఒప్పుకోక, బాహుయుద్ధానికి

తరవాత కుంజరు డనే వానరుడు సంతానం కావాలని శివుణ్ణి గురించి తపస్సు చేశాడు. శివుడు కుంజరుడికి ప్రత్యక్షమై, "నాయినా, నీకు కొడుకులు పుట్టే యోగంలేదు. కాని నీకు ఒక కూతురు దొరుకుతుంది. ఆ చక్కని పిల్లకు నా అంశన లోకోత్తరుడైన కొడుకు పుట్టి, నీ వంశాన్ని ఉద్ధరిస్తాడు," అని చెప్పాడు.



తరవాత కుంజరుడు తనకు కూతురు ఎప్పుడు దొరుకుతుందో గదా అని ఎదురు చూస్తూండగా, ఒకనాడు గౌతముడు అంజనను అతని వద్దకు తెచ్చి, పెంచుకోమని ఇచ్చి, వెళ్లిపోయాడు. శివుడి వరం యిలా ఫలించింది. కుంజరుడి సంతోషానికి అంతులేదు.

అంజన త్వరలోనే తన అసలు తల్లి దండ్రులను మరిచిపోయి, కుంజరుణ్ణి తన తండ్రిగానూ, అతని భార్య అయిన వింధ్యావళిని తన తల్లిగానూ చూడ నారంభించింది. క్రమంగా ఆమెకు యుక్తవయసు వచ్చింది. కుంజరుడు ఆమెకు వివాహం చేసే ఆలోచన ఆరంభించాడు.

ఈ లోపల కేసరి అంజన అందం గురించీ, పాట గురించీ విని ఆమెను చూడటానికి బయలు దేరివచ్చి, ఆమె వనవిహారం చేస్తుండగా చూశాడు. ఆమె బంగారు శరీరచ్ఛాయా, అందమూ చూసి కేసరికి అమిత ఆశ్చర్యం కలిగింది. ఆమె తనను వరించేటట్టుంటే ఇంకేదీ జీవితంలో అవసరం లేదని అతనికి అనిపించింది.

అంజనకు కూడా కేసరి పైన మోహం పుట్టుకొచ్చింది. కాని ఆమె ఆ విషయాన్ని తన చెలికత్తెలకు తెలియనీయకుండా, వనవిహారం కట్టిపెట్టి ఇంటికి వచ్చేసింది.

కేసరి మర్నాడు తన అప్తులతో అంజన తనకు నచ్చిందని చెప్పి, ఆమెను తాను పెళ్ళాడే మార్గం ఏమిటని అడిగాడు.



"కుంజరుడు మనకు బంధువు కాదగిన యోగ్యుడే. అతన్ని మంచిగా అడిగి చూద్దాం. పిల్ల నియ్యనంటే బల ప్రయోగం చేద్దాం," అన్నారు కేసరి బంధుగణం.

తరవాత కేసరి పంపిన పెళ్ళి పెద్దలు కుంజరుడి వద్దకు వచ్చి, కేసరి ఉద్దేశం తెలిపారు. కేసరి అంత వాడు తనకు అల్లుడు అవుతున్నందుకు సంతోషించి, కుంజరుడు అంజనను అతనికి శాస్త్రోక్తంగా పెళ్ళి చేశాడు.

అయితే చాలా కాలం అంజనకు సంతానం కలగలేదు. సంతానం కోసరం అంజనా, కేసరీ ఎన్నో నోములూ, వ్రతాలూ చేశారు, కాని ఫలితం లేకపోయింది. చివరకు అంజన పిల్లల కోసం వాయు దేవుణ్ణి గూర్చి తపస్సు చేయ నిశ్చయించింది. కేసరి అందుకు సమ్మతించి, పుంజకస్థలం అనే చోట ఆమెను తపస్సు చెయ్యమన్నాడు. అలాగే అంజన వాయు దేవుణ్ణి ధ్యానిస్తూ తపస్సు ప్రారంభించింది.

చివరకు వాయుదేవుడు కరుణించి, తాను చాలా కాలంగా మోస్తున్న శివుడి తేజస్సును ఒక పండు రూపంలో తెచ్చి, అంజన ముందు పెట్టి, వెళ్ళిపోయాడు. అంజన ఆ పండు తిని గర్భవతి అయింది. ఆమె తనలో గర్భచిహ్నాలు నానాటికీ ఎక్కువ అవుతూ ఉండటం చూసి ఆశ్చర్యపడి, ఆందోళన చెందింది. ఒంటిగా తపస్సు చేసుకునే స్త్రీకి గర్భం ఎలా కలుగుతుంది? ఈ సంగతి తెలిస్తే నలుగురూ ఏమంటారు? ఆమెకు ఏమి చెయ్యాలో తోచలేదు.

ఇంతలో ఆకాశం నుంచి అశరీరవాణి ఇలా పలికింది:

"అమ్మాయీ, విచారించకు. ఒకప్పుడు శివుడు వానరరూపంలో ఉండి, తన తేజస్సును వాయుదేవుడికి ఇచ్చాడు. వాయుదేవుడు దాన్ని నీకు పండు రూపంలో ఇచ్చాడు. దాన్ని నువు తినటం

చేత సాక్షాత్తూ ఆ శివుడే నీ గర్భంలో పెరుగుతున్నాడు. నీకు గర్భం కలగటానికి వాయువు సహాయ పడ్డాడు గనక ఆ కుర్రవాడు వాయునుతుడుగా ప్రఖ్యాతి పొందుతాడు; మూడు లోకాలలోనూ అంతులేని కీర్తి సంపాదిస్తాడు."

అశరీరవాణి ఇలా చెప్పిన మీదట వాయుదేవుడు అంజన ఎదట ప్రత్యక్షమై, "అశరీరవాణి చెప్పినదంతా యదార్థం. విచారించక, నువు వెళ్ళి నీ భర్తతో ఇలా జరిగిందని చెప్పు." అని అదృశ్యమయాడు.



అంజన కేసరి వద్దకు తిరిగి వచ్చి, అతనితో జరిగినదంతా చెప్పింది. కేసరి సంతోషించాడు.

ఒక సంవత్సరం గడిచిన మీదట అంజన ఒక పిల్లవాణ్ణి కన్నది. వెంటనే దేవదుందుభులు మోగాయి, పుష్పవర్షం కురిసింది. ఆ కుర్రవాణ్ణి చూసి కేసరి అపరిమితమైన ఆనందం పొంది, పండగ చేసుకున్నాడు.

పిల్లవాడికి ఆకలి తీరటానికి పళ్ళు తీసుకొద్దామని అంజన, తన బిడ్డను తమ పర్ణశాలలో చిగురుటాకుల పక్క మీద పడుకోబెట్టి, అడవికి వెళ్ళింది. కాని ఆ పిల్లవాడు ఆకలి మీద ఉండి, తల్లి వెనకగా పర్ణశాల బయటికి వచ్చి, తూర్పు దిక్కుగా చూశాడు. అప్పుడే తూర్పు కొండమీది నుంచి ఎర్రగా పైకి వస్తున్న సూర్యబింబం కనిపించింది.

దాన్ని చూసి ఆ కుర్రవాడు పండు అనుకుని, తెలియని తనంవల్ల దాన్ని పట్టుకునే ఉద్దేశంతో ఆకాశానికి ఎగిరాడు. అలా సూర్యుడి కేసి ఎగిరి పోతున్న ఆ కుర్రవాణ్ణి చూసి యక్షులూ, రాక్షసులూ, నాగులూ నివ్వెరపోయి, ఏదో ప్రళయం ముంచుకొస్తున్న దనుకున్నారు. ఇదేదో అపూర్వ మైన కొత్త అవతారంగా వాళ్ళకు కనబడింది.

తన అనుచరులు ఆ కుర్రవాణ్ణి చూసి భయపడుతూ ఉంటే సూర్యుడు వారితో, "ఇతడు ఈశ్వరతేజస్సుతో లోకాలను

రక్షించటానికి పుట్టిన ఆంజనేయుడు. గొప్ప బలశౌర్యాలు కలవాడు. అయితే కుర్రతనం చేత నన్ను చూసి, పండు అని భ్రమపడి, తినటానికి వస్తున్నాడు. భయపడకండి," అన్నాడు.

తనను చూసి పండు అని భ్రమపడి దగ్గిరికి ఎగిరి వచ్చే ఆంజనేయుణ్ణి చూసి సూర్యుడు ముచ్చటపడి, తన వేడిని తగ్గించేసుకున్నాడు. ఇంతలో ఆంజనేయుడు వచ్చి సూర్యుణ్ణి పట్టుకుని నోట్లో పెట్టుకుని, వేడి అనిపించి మళ్ళీ బయటికి తెచ్చి, చేత్తో కొట్టి, తిట్టి, గొడవ పడసాగాడు.

ఆరోజు అమావాస్య. రాహువు సూర్యుణ్ణి పట్టుకునే రోజు. అందుచేత సూర్యుణ్ణి మింగటానికి రాహువు ఆ సమయంలో వచ్చాడు. రాహువుని చూసి ఆంజనేయుడు పెద్ద పెడబొబ్బ పెట్టాడు. అది విని రాహువు భయకంపితుడై అతివేగంగా పారిపోయి, స్వర్గం చేరి, ఇంద్రుడి కొలువుకు వెళ్లాడు.

ఇంద్రసభలో విద్యాధరులు ఇంద్రుడికి స్తోత్రపాఠాలు చదువుతున్నారు. తుంబుర నారదులు వీణలు వాయిస్తున్నారు. అప్సరసలు నాట్యం చేస్తున్నారు. ఇంద్రుడు చింతామణిపీఠం మీద వైభవంగా కూర్చుని ఉన్నాడు. రాహువు ఇంద్రుణ్ణి చేరి, "నీకేం? నువు హాయిగా ఆటలతో పాటలతో కాలం గడుపుతూ, ఉన్న మతి కూడా పోగొట్టుకున్నావు!" అన్నాడు.

"అదేమిటి?" అన్నాడు ఇంద్రుడు.

"ఇవాళ పర్వదినం గదా, సూర్యుణ్ణి పట్టుకుందామని నేను వెళ్ళేసరికి, నాకు శత్రువుగా మరొక రాహువు దాపరించి సూర్యుణ్ణి పట్టేశాడు. సూర్యుణ్ణీ, చంద్రుణ్ణీ పట్టటానికి ఇంకో రాహువు ఉంటే నేను దేనికి?" అన్నాడు రాహువు.

ఇంద్రుడు నివ్వెరపోయి, "ఏమిటీ? ఇంకొకడెవడో వచ్చి సూర్యుణ్ణి పట్టాడా? ఏదీ, నా వెంట రా!" అని, ఐరావతాన్ని ఎక్కి, చేతిలో వజ్రాయుధాన్ని పట్టుకుని, వేగంగా బయలుదేరాడు.





# అమరవాణి

న దేవో విద్యతే కాష్ఠే,
న పాషాణే; న మృణ్మయే ;
భావేషు విద్యతే దేవః,
తస్మా ద్భావో హి కారణం. 1

[దైవం కఱ్ఱలోనూ, రాతిలోనూ, మట్టిలోనూ లేదు; మనసులోనే ఉన్నది. అందుచేత మనస్సే అన్నిటికీ కారణం.]

మనసైవ కృతం పాపం,
న శరీరకృతం కృతం ;
యేనై వాలింగితా కాంతా,
తేనై వాలింగితా సుతా. 2

[మనసు చేత చేసేదే పాపంగాని, శరీరంతో చేసేది కాదు. భార్యను ఆలింగనం చేసుకునే శరీరమే కుమార్తెను ఆలింగనం చేసుకుంటుంది.]

దధి మధురం, మధు మధురం,
ద్రాక్షా మధురా, సుధాపి మధురైవ ;
తస్య తదేవ హి మధురం
యస్య మనో యత్ర సంలగ్నం. 3

[పెరుగు తీపి, తేనె తీపి, ద్రాక్ష తీపి, అమృతం తీపి, ఎవడి మనస్సు దేనిమీద లగ్నమై ఉంటుందో వాడికి అదే తీపి.]

మనస్సు

Photo by N. S. Olaniya



బహుమతి
పొందిన వ్యాఖ్య

కొప్పులో పువ్వు

పంపినవారు :
ఏ. భాస్కరరావు,

Photo by P. Krishna Kumar



చావలివారి స్ట్రీట్,
తుని.

తుప్పలో పువ్వు

బహుమతి
పొందిన వ్యాఖ్య

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 20 లు





★ వ్యాఖ్యలు అక్టోబర్ 20వ తేదీలోగా చేరాలి. వ్యాఖ్యలు పోస్టుకార్డు పైనమాత్రమే రాయాలి.

★ వ్యాఖ్యలు ఒక్కమాటలో గాని, చిన్న వాక్యంలో గాని వుండాలి. రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి. గెలుపొందిన వ్యాఖ్యలు డిసెంబర్ నెల సంచికలో ప్రకటించబడును.

# చందమామ

ఈ సంచికలో కథలు వింతలు - విశేషాలు



రెండవ అట్టు:
ఆలయం

మూడవ అట్టు:
సమాధి


Printed by B. V. REDDI at The Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Chandamama Publications, 2 & 3, Arcot Road, Madras-600026. Controlling Editor: 'CHAKRAPANI'

ఒకరు 'ఇంద్రాణి, మరొకరు దేవరాణి ఈ యిద్దరిలో ఎవరు పట్టపురాణి?




సురేష్ మూవీస్

# చక్రవాకం

ఈస్ట్‌మన్ కలర్

నిర్మాత:
డి.రామానాయుడు

దర్శకత్వం:
వి.మధుసూధనరావు

కథ: ఆరికెపూడి (కోడూరి) కౌసల్యాదేవి  రచన: ఆచార్య ఆత్రేయ

సంగీతం: కె.వి.మహదేవన్  కెమెరా: మార్కస్ బార్‌ట్లే

విడుదల:
ఆంధ్ర సీడెడ్
నవయుగ ఫిలింస్

నైజాం:
విజయా సురేష్ పిక్చర్స్

NVKR

*Photo by:* ANANT DESAI



A MONUMENT

